శ్రీ చెన్నకేశవసహాయం.

శృంగారకరుణాదైన్య రౌద్రరస ప్రాధాన్యంబైన

# మిత్రవిందాపరిణయనాటకము.

---

ఇది

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా మాచర్లగ్రామనివాసుండును

సంగీత సాహిత్యవిద్యా విశారదుండునగు

బ్రహ్మశ్రీ సూరపరాజు వేంకటరమణకవిచే

రచియింపఁబడి

ఆకెళ్ళ సూర్యనారాయణశాస్త్రిచే

పరిశోధింపఁబడి,

నల్లగొండజిల్లా భువనగిరితాలూకాలోఁజేరిన చొల్లేరుపుర దేశపాండ్యావృత్తిదారు

భారద్వాజసగోత్రోద్భవులైన వ పటువారి యధికారములను పొందిన

మహారాజరాజశ్రీ

తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారికి

కృతియీయఁబడి

ఏలూరు

మంజువాణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1911.

# ఈనాటకములో వచ్చెడు స్త్రీపురుషపాత్రలు.

## స్త్రీపాత్రలు.

1 నటి.
2 వేశ్యాస్త్రీ-శృంగారవతి.
3 మిత్రవింద-కధానాయిక.
4 కీరవాణి-మిత్రవింద చెలికత్తె.
5 మదనమాల-డిటో.

## పురుషపాత్రలు.

1 నటుడు.
2 విందరాజు (మిత్రవింద) పెద్దన్న.
3 విందరాజు-భటుడు.
4 విందరాజు-మంత్రి (నర్మసచివుడు)
5 దుర్యోధనభటుడు (చండప్రతాపుడు)
6 ఆకాశవాణి(విష్కంభము)
7 అనువిందుడు (విందరాజుతమ్ముడు)
8 నారదుడు (దేవతాముని)
9 కృష్ణమూర్తి.
10 బలరాముడు (కృష్ణమూర్తిఅన్న)
11 సాత్యకి (కృష్ణమూర్తితమ్ముడు)
12 కృతవర్మ (కృష్ణమూర్తి స్నేహితుడు)
13 దుర్యోధనుడు (రాజరాజు)
14 దుశ్శాసనుడు (దుర్యోధనుని తమ్ముడు)
15 లక్ష్మణుడు (దుశ్శాసనునికొడుకు)
16 కర్ణుడు (దుర్యోధనుని ప్రాణమిత్రుడు)
17 మాళవరాజు
18 కోసలరాజు
19 కాశీరాజు
20 సాల్వరాజు
} వీరు దుర్యోధనపక్షపువారు.
21 కేకయరాజు
22 సృంజయరాజు
23 కర్ణాటరాజు
24 మత్స్యరాజు
} వీరు కృష్ణుని పక్షపువారు.
25 వ్యాసమహర్షి.

## చతుర్థాంకము.

రం (1) మిత్రవిందాస్వయంవరప్రారంభమునకు విందానువిందులు మంత్రితో నాలోచించుట, గర్గమునిసమాగమము. గర్గముని విందానువిందులతో సంభాషించుట, ఇది హాస్యరసప్రధానము.

(2) మిత్రవింద కృష్ణునింగూర్చి పరితాపించుట దైన్యరసము. మదనమాల కీరవాణి యను చెలికత్తెలకు మిత్రవిందకు సంవాదము. శృంగారరసము. మిత్రవింద తనపటంబుతో కీరవాణియను చెలికత్తెను కృష్ణమూర్తిదగ్గరకు పంపుట.

(3) శ్రీకృష్ణునికొల్వు. శ్రీకృష్ణునకు మంత్రికి సంవాదము. శ్రీకృష్ణుండు మంత్రితో తనకు దక్షిణవామ భుజనేత్రంబులదురుచుండెనని చెప్పుట. దానికి మంత్రి సదుత్తరంబిచ్చుట, ఆశ్చర్యరసము.

4 కృష్ణునికడకు కీరవాణియను మిత్రవిందదాసి ప్రవేశించుట. కీరవాణికిని కృష్ణునకును సంభాషణము. కీరవాణి మిత్రవిందపటంబు కృష్ణునకుచూపించి మిత్రవిందసోయగంబు మిక్కిలిచెప్పుట శృంగారరసము, కృష్ణుండు సంతోషించి స్వయంవరమునకువచ్చెదనని కీరవాణితో చెప్పుట, కరుణారస ప్రాధాన్యము.

## పంచమాంకము.

రం (1) శ్రీకృష్ణుని పటంబుతో కీరవాణి మిత్రవిందకడకువచ్చి పటంబుచూపుట. పటంబుజూచి మిత్రవింద కృష్ణుని వర్ణించుట.

(2) అవంతీనగరము. కృష్ణసాత్యకి దుర్యోధన ప్రభృతిరాజులు గొప్ప ఉద్దాలమేడ మిత్రవిందను శృంగారించి చెలులుసభామధ్యంబుననిల్పుట. ఆసమయంబునందు కృష్ణమూర్తి మోహంబునొంది మిత్రవిందనువర్ణించుట శృంగారరసము మిత్రవిందసఖులనుచూచి సభాసదులనామంబులు చెప్పుమని చెలులనడుగుట. చెలికత్తెలు దుర్యోధన కృష్ణ ప్రభృతినృపశేఖరుల వేరువేరుచూపించుట. దుశ్శాసనపుత్రుండగు లక్ష్మణకుమారుండు మిత్రవిందనుపట్టబోవుట. మిత్రవిందలక్ష్మణకుమారుల సంవాదము. మిత్రవిందలక్ష్మణుని తృణీకరించి మాట్లాడుట రౌద్రదైన్యరసములు. ఆసమయంబున లక్ష్మణానువింద దుశ్శాసన కృపవర్మ కర్ణ సాత్యకి ప్రముఖులకు యుద్ధంబుజరుగుట మహారౌద్రరసము. వ్యాసమహర్షిప్రవేశము. వ్యాసుండు కృష్ణమూర్తిని వర్ణించి మిత్రవిందకు కృష్ణుండేవరుండగునని అందరికిచెప్పుట, శాంతరసము. మిత్రవిందకృష్ణునివరించి పుష్పమాలకంఠమునందు వేయుట శృంగారరసము.

(3) మిత్రవిందావివాహము. విందానువిందులు కృష్ణునివేడి యనేక కట్నంబులతో మిత్రవిందాసహితముగ సాగదోలుట.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

నాంది.



రాజద్ధరణీతనూజముఖరాజీవంబు స్వాస్యాబ్జుని
న్జేర న్వంకగొనంగ నేత్రరవినిర్జైనెప్పగా జాపిత
న్నారిన్రంజిలజేసి కూరిమెదజెందఁజేయు చోల్లేరు స్సీ
తారామప్రభుఁడేలుగావుత మహోద్యత్కీర్తి
మమ్మెప్పుడున్.

సీతాస్తవము.

చ. నుతగుణపూత హేమమణినూతనరూపసమేత సర్వస
మ్మతమతభూత దుర్భవసమూజపయోనిధిపోత స్వర్గపదా
శ్రితజనమాత నిర్జితవిశిష్టబలిష్టకిరాత యిందిరా
ప్రతినిధిజాత సీత సుకృపన్మనుబ్రోవుత నెల్లభంగులన్. 2

(నాద్యంతంబున సూత్రధారుండు రంగస్థలంబుజొచ్చి ప్రాంజలియొనర్చి నవ్వుమొగంబుతో)

సూ—సీ. పరమవిద్యాపరంపర బృహస్పతి బోలి,
కరము మించెడు భూమిఖచరులార!
పృథుతరశౌర్య సంపద నర్జుని గెలి,
వసుధ నేలెడి రాజవర్యులార!
యతులిత భూరి భాగ్యత గుచేలుని మించి,
పొలుపు గాంచెడు వైశ్యపుత్రులార!
భూరిధాన్యవిభూతి గౌరీశ్వరునిసల్పి,
ప్రీతి దేలెడు పాదజాతులార!

గీ. తేవ మీఱంగ నేను పండితుడ కాను
కవిని గాన లసద్గానకఘనుడగాను
కాకపోయిన నొక నాటకంబు నాడ
బూనినాడను కరుణించికొలువుమయ్య. 3

(అనియంతకంతకు డెందంబునానందంబు చిందులుత్రొక్క)
ఎందుకుసందియంబు? నేనాడదొడంగిన్న నాటకంబువిఘ్నంబుగాకుం
డునటుల రక్షించుగలవాడా చొల్లేరుసౌధాగ్రసంచారుడగు సీతా
రామచంద్రుడే కలండొక్కమాట వేడుకొనియెద (నని)

1. బేహాగ్—ఆదితాళము.

వందనమిహశౌరి హరి హరి మందరధరధారి।
నతజనచందనశంకరవందనమామక బృందావ్యవిహారి॥ వం॥
నవతులసీమాలా।గోకుల। భవనహేమచేలా।
గాధిజసవనావన సత్యవిజీవనదుర్భవవారిధికోలా॥ వం॥
సారసదళనేత్రావార్షిక నీరదనిభగాత్ర పావిత్రా।
నారదశారద నీదరపాండురభూరియశశ్చిత్ర॥ వం॥
స్ఫాయద్గుణరంహతాడేపలి లక్ష్మీనృసింహా।
రాయార్చితచొల్లేరుపురీనిలయా యుతరఘుసింహా॥ వం॥

(అని కొంతసేపూరకుండి ప్రతిశిరవంకజూచి శిరఃకంపం బొన
ర్చి బిగ్గరగా ఓసి! ప్రేయసీ! నీయొడలసింగారంబు కడచేసికొని
వడివడిగా నియ్యెడకురమ్ము, వచ్చుచో తేనెలూరుగానంబుతో వీన
యీనునిబాడుకొమ్ము ఏదినీగానసాహిత్య విద్యాకౌశలంబు చెవు
లారవినియెద.

నటి— (మంతనంబున సంతసింపుచు హాసన్ముఖయై)

2. శుద్ధకాంభోజి—రూపకం.

రాధికాలోలా। సురనాథపాలచేలజితకర్బుర॥ రా॥
మోదంబుననినునమ్మితిరారా। దయ। లేదనాపై నందకుమారా।

యురి! సాధనమధుసూదననేనీదరిజేరితినీ మృదుపాదంబులు నాయెూ
దలకాదనకను మోపరహరి॥ రా॥

నీవేధారవనినమ్మితిశౌరి! గారీ! వరపూజితమురవైరి! సద్భా
వముతోననీదరి జోవుముకమలా వరశరధి! వలయితసదనాకవిజీ
వన నతపావనహరి॥ రా॥

దాసజనుల జోచెదవటనీవునే! డోసిలిడితియురి కన్గొనలేవు!
వన! వాసంబున నపకారముచేసిన కాకాసురుపైరోసంబున నిశితా
స్త్రములేసిపిదప రక్షించిన॥ రా॥

వాసిగధరచోళ్లేరుపురమున! నీవాసముగదజూడగ సతతము
న! లక్ష్మీసఖతాడేపల్లి లక్ష్మీనరసింహాభి ధకాద్భుసుర హృత్పద్మ
స్థితకేసరీబలభరాసురహిత॥ రాధి॥

పరివర్జితమన్మనోగతిఖేదా! నాథా! భవత్పదంబులకు నమ
స్కరించుచున్నదాన.

సూ—పరివర్జితచే—నటీ! నటీ! చిరంజీవివై వర్ధిల్లుము. (అనియోమో
యాలోచించి) కాంతా! యీవచ్చినమహాజనపుంగవులిచ్చలో మె
చ్చునట్లుకొంత హిందూస్తానితో భాషింపుము)

నటి—చిత్తమూలాగేమూట్లాడెద

3. హిందూస్తాని—టప్పాజల్వ

అప్నేకిస్వాస్తేముం ఝుతలబ్ కియ్యాహూ! హాజరీమజ్లీస్కేది
ల్కాఅరజుకహూ॥ అప్నే॥ బందానవాజ్ యిస్గరీబ్కామారుజాసునో-
వుందాతరీకామేరాగానాసునేహైవునో॥ అప్నే॥ ఆజ్ యేక్నాటక్కా
లియ్యేఅప్నేయీర్షాద్హై! తేజుసెఖేల్మేకమన్తామేరేదిల్పేహై॥ హాగ్
వఖ్తులక్ష్మీనారసింహా రాయనాంసఖి పర్వర్ధిగార్చెల్లేటి సీతాపతిదే
గానుఖీ! అప్నే॥

అజీఖావిన్ద్ అఫ్మేరెలియ్యో యాందుపర్మాయతగ్ పిడిల్హా
ర్మనీ వీణాగానవివోద్కెముఝమన్షాఆనందుపాయిధి అయిసేహాలత్
మేఆప్కేహాకుంతామిల్కార్నాపడా అయిందాక్యా యిర్షాదుయిన్

జగేపర్ బెంచి కుర్చి పర్నీచర్ రోష్ని మా జూద్ హై । క్యావ
ర్ఖాఅహై లెమజ్లీ సీతప్రిఫావురీ కేంకర్హు వాహై మాలుంకర్నా చ
హాతీహుం (అనువాక్యంబులు కర్ణానందంబులు సేయుచు బిగ్గరగా.)

సూ—కప్పురగంధి నిప్పు డొప్పుగా పలికెడు పలుకులకు నాడెందబా
 నందంబొందియున్నయది. మనమీరాత్రి యొక్క యపూర్వనాట
 కంబు ప్రదర్శించెదమని యీసుజనపుంగవు లెఱిఁగించి యు
 న్నవారలు. వారలకింపుసొంపుకన్పింపసేయు తెఱంగునీసొమ్ముని న
 మ్మియున్నవాడ కొమ్మా! బంగరుబొమ్మా!

ఉ. ఇయ్యెడ సత్కవీశ్వరు లంహీన యశస్కరులైన పండితు
 ల్లెయ్యమలర్పు గాయకులనేకులు వచ్చిరి పేశలోక్తులు
 న్దియ్యని మాటలున్మిగులఁ దేటగు నర్థముఁ గల్గు నాటకం 4
 బియ్యెడ లన్ప్రదర్శనమనోహయగతి న్వెస సేయు సుందరీ!

 బోటి! నేటిజేయ నాడిననాటకమే పూటపూట నోటులేక
చూచుటకీ యెల్లర యుల్లంబులు పల్లవించునట్లు సేయుము. నీజాణ
తనంబును నీయొద్ద విద్దెగఱచినవారల బుద్ధికౌశలంబులే గనుంగొని
యెద.

నటి—పండితకుమారా మీరాజ్ఞాపించిన నాటకం బెయ్యదియో తెలి
 యదయ్యె తెలిపినదియె ప్రదర్శింపించెద.

సూ—(అనిన గొంతసేపూరకుండి ప్రకాశముగా)

సీ. శ్రీమద్భువనగిరిసీమస్థనూతన
 లేఖకాపురము చొక్కల్లేరు పురము
 శబ్దశాస్త్రాదిశాస్త్రజ్ఞాన విద్వత్కు
 మారభాసురము చొక్కల్లేరు పురము
 లాలిత నవరసాలంకార విత్కవి
 వారబంధురము చొక్కల్లేరు పురము
 నిత్యసంగీత సాహిత్య విద్యారంభ
 కారణాధరము చొక్కల్లేరు పురము

గీ. యిట్టిపురమున కాపురంబలరు వారు
యెలమి వైదిక లౌకికమెఱుఁగు వారు
యమిత ధనధాన్య సంపదఁనలరు వారు
పసుపుకలవారు శ్రీతాడేపల్లివారు. 5

శా. ఆతాడేపలి వంశవార్ధి శశియై యానంద సంధాయియై
ఖ్యాతిఁజెందెను వెంకటాచలము విద్యన్ రెండవ బ్రహ్మయై
పాతివ్రత్యమునం ధరుంధతి యనన్ బ్రాటిల్లు బాపమ్మతో
చేతోజాతుని కేళిఁగూడి గనియెన్ జెన్నొప్ప దాసాహ్వయున్. 6

సీ. ఆమంత్రిశేఖరుం డలరి వ్రాసిన వ్రాత
లాణిముత్యంబులఁ గేరి సేయు
ఆమహామాత్యోత్తముం డలతి బన్నినయుక్తి
యౌగంధరునైన నలతపెట్టు
ఆప్రధానాగ్రణి యధికార మొనరించు
నేకపింద్రునినైనఁ దూరముంచు
ఆ నియోగియొనర్చు దీనపోషణలెల్ల
శ్రీవిష్ణుకైననుఁ జిత్రమొసగు
గీ. నాయనయొనర్చు స్నాన సంధ్యాది విధులు
బ్రహ్మకైనను మదిదృప్తిఁ బఱపు చుండు
నాసుగుణశాలి యెఱుగు విద్యాబలంబు
దేవతాచార్యు నయిననుఁ ధిక్కరించు. 7

సీ. ఎలమి విప్రులకన్నమింటిలోఁ బెట్టినా
నెలకైన నాకలిఁ గలుగ బోదు
పూని వేడుకతోడఁ దానం బొసంగెనా
యెవ్వరి యాచించ రేటి దాక
యిచ్చెద ననుచు వాక్రుచ్చెనా నదిశిలా
క్షర శాసనంబయి జరుగు చుండు

కానిమ్మనుచు శిరః◆కంపంబు చేసినా
నదిమనో భల్లమై◆మెదలు చుండు

గీ. కన్ను లాగి విప్పి చూచెనా◆కఠిన శత్రు
జాలమయినను బింకము◆ల్జారి యుండు
రట్టి దాసయ్య మంత్రికిఁ◆దైన వార
లీయుగంబున గలరె మహీ◆స్థలమున. 8

శా. తీయన్రాని మదంబు నన్జనులు మక్తేదారు వా దేశ పాం
డ్యాయంచు న్నాలకర్ణియంచును బెసన్స్వార్దో మొకద్దంబటం
చాయావేళల నెన్నుచుండగ హితంబై దోపనుద్యోగమం 9
దేయాక్షేపణ జెందనీక మెలగెన్హెచ్చైన సత్యంబునన్.

ఉ. తండ్రి తరంబుకంటె ఘనధార్మికుడై ఘనకీర్తి దిక్కుల
న్నిండిలవైరి భంజన రతిన్దన కెవ్వరు నీడులేకపె
క్కండ్ర ధరా సురోత్తములకున్ కాంచన రౌప్యముఖాదిదానము
ల్లుండ్రిలకిచ్చి బ్రోచె రతికోవిదు డాయన నెన్నశక్యమే. 10

క. సమ్మతితోడుత మహాల
క్ష్మమ్మ వధూమణిని సత్య◆శౌచస్థితిధా
మమ్మయితగు వెంకటల
క్ష్మమ్మాదుల బెండ్లియాడెనతిసుందరులన్. 11

ఉ. ఆమహ లక్ష్మమాంబ పతియం దతిభక్తి జెలంగ సీతయు
న్రాముని గొల్చురీతి నిక◆రంబలరార పతిన్భజించుచు
నోమలగాత్రియై యువతికోటి నుతింప జరించె సద్గుణ
స్తోమము శౌచశీలములు◆సొంపు నిలుంపులు చూచిమెచ్చగన్. 12

సీ. అత్యంత పతిభక్తి ననసూయ యనవచ్చు
శుచినరుంధతి కీడుగాన వచ్చు
వితతక్షమకు చంద్రమతియని యనవచ్చు
చెల్వమందున రతి◆జెప్పవచ్చు

చిరధనంబునను లక్ష్మికి సాటియనవచ్చు
భోగమందున శచికీడొల్పవచ్చు
వాక్సామ్య వృత్తి నివ్వాణియనగ వచ్చు
గురుకాంతి గౌరితోఁ గూర్పవచ్చు

గీ. ననగ షడ్గుణ యుక్తయై యతిథి జనుల
కన్నపానాదు లొసగుచు నలరుచుండు
కుంతలాకార రోలంబకగుణ కదంబ
లాలితనితంబ శ్రీమహాలక్ష్మమాంబ. 13

క. కరకీర్తియా సఖీమణి
గరము ముదుగ గూడి కాంచె కతినారిచమూ
నరసింహునివరలక్ష్మీ
నరసింహరాయు సుకవినాయక గేయుఁ. 14

శా. ఆ లక్ష్మీ నరసింహరాయడు దాగి బాల్యంబందె చౌషష్టివి
ద్యాలంబుండయి తండ్రిసేయుబడు కార్యంబు ల్వెసన్దీర్పగా
నీలాఖాలమ్ముగా కథే మారులకు నిత్యంబు రాజొప్పుచు
న్జాలెన్మెచ్చ నృపాలసత్పృథల ఖాంస్వద్వీతి మాట్లాడఁగ. 15

సీ. పొలువుగానే మంత్రి భోజన సమయంబు
విప్ర సంకీర్ణమై వెలయుచుండు
సరవితోనే గుణశాలి సద్ధామంబు
బంధు సంకీర్ణమై బరగుచుండు
వేడ్కతోనే ధర్మవిధుని పర్యంకంబు
పుత్ర సంకీర్ణమై పొల్చుచుండు
వరుసతోనే ధైర్యవంతుని సద్బుద్ధి
ధర్మ సంకీర్ణమై దనరుచుండు

గీ. నెలకొనేమేటి ధనశాలలలరి జెలంగ
ద్రవ్యసంకీర్ణమై మహోత్కలిక మించు

పఱఁగ నెవని హజారంబు♦వగలు దేయు
శూరసంకీర్ణమై జన♦స్తుతుల గాంచు. 16

సీ. తనకరవాలిక♦య్యావ ప్రకాశముజేసి
విబుధులకోరికే♦ల్వేడ్క దీర్చ
తనరాజ ధర్మము♦తక్కలిక నిరూపించి
పరచక్రరాజికి♦భయము సూప
తనశీతలస్వభా♦వని యతిపైకొని
పాంథసందోహంబు♦పఱఁగ బెంప
తనపుష్కర విహార♦ధారాళపద్ధతి
చూపరపెండుకు♦చోద్యమొసగ

గీ. తనదుచెల్వంబు గురుపత్ని♦దవిలిమెచ్చ
తనభవమునకు జనకుడిం♦పెనసి పొంగ
రమ్యగతిలక్ష్మి నరసింహ♦రాయచంద్రు
డలరెసత్కవి నికర♦మయ్యారె యనగ. 17

మ. హరిభోగంబు ధనుంజయప్రభయు ధ♦ర్మాత్రసూన సత్యంబు ధు
ర్భరమై ఉత్కలి ధైర్యమున్వరుణ శుం♦భత్సౌర్య మాయంజనీ
వరపోత్రిద్యుప్రబల మున్నుబేరధనము♦న్భర్గాభ సద్భాతియు
న్థరలక్ష్మి నరసింహరాయుడు గొనె♦న్దత్తత్కృపాపాత్రుడై.

సీ. తనతుపాకి గభి♦ల్లను మ్రోతవైరిక
ర్ణద్వారములు బధి♦రంబుజొన్ప
తనదానధారావి♦తానంబువంకలై
బఱగి కాల్వడగాక♦పాఱుచుండ
తనయుక్తివ్రాత కెం♦తయునర్థముగి చేసి
కొనలేక భూపాలు♦లెనసి యడుగ
తనధైర్యమహిమకు♦మోన యివ్వకనుభాను
లాగిల డాయి తొలంగి♦యూరకుండ

గీ. తనముఖాబ్జము గనుఁగొన్న చెనటు లయిన
మఱచిమాటల మించి మన్నించిపోవ
క్షితిని చొక్కెటి సుందుల క్ష్మినృసింహ
రాయునకు సాటియే మంత్రిరాజియెల్ల. 19

ఉ. లాలితమూర్తి తాఁ జేపలి లక్ష్మినృసింహ నియోగికీర్తి గో
పాలికి కామపాలికి కపాలికి పాండుర వర్ణచంద్రికా
పాలికి సర్వజాతి మృగపాలికి వార్ధిపాలికండ భూ
పాలికి హీరపాలి కవిపాలికి తాఁ కుచులిచ్చు నిత్యముల్. 20

ఉ. ఆతఁడు బీరకాంతుల మహాన్వయ సంభవుఁడంత మంత్రికిన్
కూతురికుండిన ప్రభునికూతురిగట్టుల తేని కూర్మియా
కూతురిబోలినట్టు సుమకోమలియై తగుశ్యామలాంబికా
శీతకరాస్య పెండ్లియయెపతిమాసతి పెండ్లియాక్రియన్ 21

క. వారిద్దరెలమి గాంచిరి
కోరికలలరార ముద్దుకొడుకొక్కరుని
న్నారాకారుని సుజనా
ధారుని మృత్యుంజయాభిధానునిగరిమన్ 22

సీ. కల్వలచెలికాని గాంచు సంద్రము మాడ్కి
సరిజయింతుని గన్న శచి తెఱఁగున
నలకూబరుని గన్న యులకాధిపతి రీతి
లలిని మారుని గన్న లక్ష్మి తేవ
శరజన్ము గాంచిన శంకరు చందాన
గజముఖు గాంచిన గౌరి భాతి
కరమొప్ప కృష్ణుని గాంచు నందుని పోల్కి
నమరేశ్వరుని గన్న యదితి లీల
గీ. యాంజనేయుని గాంచిన యనిలుని వలె
సరవి రఘురాము గన్న కౌసల్య గతిని

పేర్మి నర చేతులలో నుంచి పెంచుకొనుచు
మురయుచుండిరి యా వధూవరులు వేడ్క. 23

క. పతి చిత్తమెరసి మెదలుచు
పతియే దైవంబటంచు పతిగతియంచు
న్పతియే భూషణమనుచును
నతివేడుక నుండు శ్యామలాంబ పతికడన్. 24

క. మృత్యుంజయరాయుం డా
న్నత్యముగా చదువుకొనుచు నార్య శ్రేణి
న్నిత్యంబుగొల్చి వారల
సత్యాశీర్వచన లబ్ధి జరియించు ధరన్. 25

క. ప్రేమించిన యాచార్యుం
డై మది కమృతంబు చూపి యలరన్మ లక్ష్మీ
రామబ్రహ్మము రెండవ
రామబ్రహ్మం బటంచు రహి చెప్పదగున్. 26

ఏవంవిధగుణగణ భూషణుండై తాడేపల్లి లక్ష్మీనరశింహరాయాగ్రేసరుండొక్కనాడు.

సీ. ఆకెళ్ళ సూర్యనారాయణ శాస్త్రిశా
స్త్రప్రసంగములు జరుపుచుండ
జ్ఞాతులై శ్రీరామరఘుపతులును లక్ష్మినా
రాయణు లిద్దరు రహి చెలంగ
శ్యాలకుండై కీర్తి సలకిన బీరకా
యల రామారావు నేర్పులు ఘటింప
వేడ్కన్మ్యామతు భాసుర వేంకటరాయుండును
మనసిచ్చి కూరిమి మాటలాడ,

గీ. రమ్యపతంగి నరసింహరావు కూర్మి
దొరయ తాలేఖ ప్రసంగములు జరుపుచుండ

శ్వశురుఁడా వెల్లోడ కులవంశజన్ముఁ డగుచు
దనరు తిర్మలరాయుఁడు తల్లికనుండ. 27

చ. విలసిత గొల్లపూడి కులవేంకటరత్నము మేనమామయు
న్వలనుగ బొంగులూరు వరవంశ్యుఁడు వెంకటరాజయాహ్వయుం
డెలమి తదీయపౌత్రుఁడయి హెచ్చిన విఠలరావు మిత్రులై
పొలచియు సత్ప్రసంగములఁ బ్రొద్దులు పుచ్చుచునుండ వేడుకన్.

క. వారక గంగాధర శ్రీ
నారాయణ రాడ్వకీలు నర్మోక్తులచే
సారెకు స్వవ్యవహారము
శ్రీరమ్యత దెల్పుచూర్మిఁ జిందులు ద్రొక్కన్. 29

చ. సరసంబౌ కవితాచమత్కృతులఁ జిత్తాంతంబు రంజిల్ల సుం
దరసంధాను కవీశ్వరుండు నయి చెంత న్సజ్జను ల్వేరబా
స్వరత న్వెల్మలపూర్నివాసియు కృష్ణయ్యాజినామంబిల
న్బరగన్నాయఁబు సత్ప్రసంగములు సంభత్ప్రీతితో సేయఁగన్.

క. వలనుగ రాజాశ్రితుఁడై
తేల దేవులపల్లివంశదీపకుఁడై వ
ర్ధిలు రామకృష్ణయాఖ్యుం
డలరుచు మనమరసి మాటలాడుచు నుండెన్. 31

సీ. భాసుర దురుసుగాన్నల్లి శ్రీమదనంత,
రామయ్యగారు నిర్మలతనుండ
రహిరామడుగు శివరామయ్య సంతోష,
భరితుఁడై యొకపక్క బరిఢవిల్ల
కొమరొప్పగను పరాంకుశము శేషాచార్య,
వర్యుఁ డంచద్ధతి వలను మీఱ
కామించి నెల్లుట్ల రామసింగతి మైత్రి
నెరపుచు సద్గోష్టి నియతి నుండ

గీ. మున్ను వంశోద్భవుండయి బుధుల జూచి
సంతసించెడు శ్రీమదనంత రెడ్డి
భూరిగుణుడై జెలంగెడి సారబుద్ధి
రత్న రెడ్డియు సంతోషరాశిదేల. 32

కం. అగణితమగు సంపదచే
దగు రామిడి నరసిరెడ్డి దర్పోద్ధతుడై
మిగులు కిషణ్ శింగును సాం
పుగ మాటల నాడుకొనుచు పూర్ణత నుండన్. 33

క. లలినొప్పెడి లక్ష్మణశిం
గలకాచము చంద్రయాఖ్యులతి వేడుకతో
వలనుగ తమతమ కార్యము
లలరుచు చెప్పుచును నుండ నాశ్చర్యముగన్. 34

క. నెయ్యమున పాక పద్ధతి
సయ్యన నలభీమ నృపుల చక్కగ సరి రా
నియ్యని పిల్లల మరి కో
టయ్యయు తనుగొల్చి మాటలాడుచు నుండన్. 35

సీ. వసుధ తాడేపల్లి వరరాజయాఖ్య ప్ర
ధాని యెవ్వని తండ్రి తండ్రి తండ్రి
ధరకవి పద్మభాస్కర వేంకటాచల
ధార్మికుండే మంత్రి తండ్రి తండ్రి
నిస్తుల కీర్తి ప్రకాశస్థుడై చెల్వొందు
దాసయ్య పంతులే ధన్యు తండ్రి
రమ్యమృత్యుంజయ రాట్చ్రీశౌర్యాగ్రణి
కేయ మాత్యోత్తముండెలమి తండ్రి

గీ. యట్టి లక్ష్మీనృసింహరాయాగ్రగణ్యు
డాప్తబంధు ప్రముఖులనెయ్యమునగూడి

యొక్కనాడు కుతూహలంబుప్పతిల్ల
యుక్త నాటక మొకటిసేయుమనికోర. 36

ఇవ్విధంబున వజ్రవైఢూర్య గోమేధికేంద్ర నీలమరకత మాణిక్య ప్రభృతి రత్న స్థగిత దేహళీ కవాటస్తంభ సంభృతంబై, నానావిధచిత్రపుత్రికావిలసితంబై, ఇంద్రుని వైజయంతంబు న్దిరస్కరించుసభామంటపంబున ననేక విద్వత్కవిపాఠక నటవిటగాయక దాసదాసీ వీరభటసంయుతుండై పేరోలగంబుండి యొక్కనాడు.

శా. మాచోల్లేరు రఘుప్రవీరు కృతియై మాధుర్య వాగ్జాలమై
శ్రీచెన్నొందెడి యుక్తయుక్తి యుతమై శృంగార శయ్యాఢ్యమై
రాచర్లేచ్చెడి యొక్కనాటకము తోరంబొప్పగా చెప్పుమా
నీచాతుర్యము దోపసత్కవివరా నేదించు వాక్రుచ్చినన్ 37

సంతసించి తదీయ బహూకృత తాంబూల జాంబూనదాంబరాభరణాదికంబులు గ్రహించి

గీ. మిత్రవిందా సరోరుహపత్రనేత్ర
పరిణయము నాటకంబుగా ప్రచురపరిచె
ధరణిసూరప రాడ్వెంకటరమణకవి
యుదియె నేడు ప్రదర్శింపుమబ్జవదన. 38

(అనిన దరహసిత వదనారవిందయై చేతులు జోడించి)

నటీ—నిజమునిజము! సరస కవితా చమత్కృతిచే పరిఢవిల్లుచున్న యీనాటకంబుండ నదియేదియో సెలవివ్వమనిమిమ్ము కోరడము నాకెంత బుద్ధిమాంద్యంబుచూపట్టె, నిది ప్రథమ తప్పితంబుగా నెంచి క్షమాపణయొనర్ప కోరుచున్నదాన.

సూ—మంచిది నీవీసంశయం బుంచుకొనక నాటక ప్రదర్శనమునకు ముందు శరదాగమంబు వర్ణించు మేదినీ ప్రౌఢత్వంబు కనుగొని యెద.

నటి—చిత్తమాలాగే వర్ణించెద.

సీ. మలినంబులేని నిర్మలవస్త్రమన మబ్బు
పోయి మిన్నొప్పుఁడు పొల్పుమీఱ
గాలిపై పై పోక దూలి ఖస్థలి బాసి
ఘనజాలమే కాలమున నడంగు
తెల్లని మేల్కట్లు దివ్వరుముత్తెములన
నాకసంబున జుక్కలమరు నెపుడు
నిర్మలచంద్రికానిచయంబుతో చంద్రి
కేదినంబులలోన నింపుచూపు
గీ. హాలికులచే లవిత్రంబు లోలిఁబూచి
సరవిభయముఁబొంది కలమాది సస్యపంక్తి
మించి మ్రొక్కెడు గతితలల్వంచు నెన్న
దట్టి శరదృతువును నెన్న నానెనాఁడు. ౨౯

హిందుస్థాని—ఏకతాళము.

శరదృతువర్ణన సేయుగ దరమా నే సుందరరూపక।
యాసురలకునైన భూసురులకునైన॥ శర॥
కరముమీర పండువెన్నెలగాయుచుండు దిక్కుల।
మురువుదోప మగలునాండ్ర ముద్దుగొందురు చెక్కుల॥ శర॥
నిర్మలంబౌ జలములతో నిండియుండు కొలుకులు।
పేర్మితో డబల్కుచుండు పెక్కుమార్లు చిల్కలు॥ శర॥
చేరదీసి తాడేపలి లక్ష్మీనృసింహరాయుని।
కోరికలుదీరుచు చొల్లేరు హరివాహ్యాయను॥ శర॥

అహో! ధరాతలంబునంగల ప్రతిగ్రామపట్టణ జనపదంబుల న్గాపురంబులు సేయు వారల సేద్యంబులచే పుట్టిపెరిగి దట్టమయినకలమాది సస్యసంఘమంజరీ పుంజంబుల దమతమ పుత్రమిత్ర కళత్రంబులతో వాసిమీఱ డాసి చంచువులతో దుంచి, మొసవిపసగల మేనులతో, నాపొలంబుల గాపాడనెంచి మంచలపైనున్న వన్నెలాడులపై

దవులు దొండపండులవలెదోప నాపరాని సంతోషంబుల కళుక్కున నరిచినవార లుల్కిపడి యదలించిన బెదరి సమీపస్థ భూరుహాగ్రం బులపై చేరి పలుకుచున్న చిలుకలచే ప్రకాశించునదియు, నిండానిండి యుండుకొండంబు లంతకంత కంతరాయంబై పోవబోవ కప్పురంపు టరుగుల మగరాలగోడలమేడలకు గట్టినమెట్లులవలె దట్టముగాకన్ప ట్టుసైకత ప్రదేశంబులచేదీపించు నదీనదంబులచే నొప్పినదియు గొ ప్పగొప్పయడవుల బడలికలేక తపంబులొనర్చు జటిశేఖరుల కప్పుర గంధు లప్పుడప్పుడుతప్పక వినోదసంజాయమానమానసంబుల తమ తమ కలశంబుల నిలిచియున్న సలిలంబులచేపెంచ పెద్దపెరగి బొద్దు లుకనుపించురసాల నారికేళాది ధరాజసంతానంబులచే వింతలుగ న్పించునదియు, తరణికిరణ ప్రసారణంబునకును వాతసంచారంబున కును చోటివ్వక వాటమయిన లతాపత్ర పుష్పగుచ్ఛంబుల నల్లుకొని పెల్లివిరిసిన మల్లికాదిక్షోణిజరాజంబుచే రాజిల్లువనంబులచే రంజిల్లున దియు, యిందీవరకల్హార పుండరీకప్రభృతి నీరజంబుల నూరుచున్నమ కరందంబుల పొట్టలనిండారకుట్టులపుట్టతాగి సొలిసొక్కుచు నెక్కు డచూచినందాననైయె ఝుమ్మఝుమ్మన నోంకృతియుతుమ్మెదమొత్తము లచే యమ్మొగుల్కుచున్నదియునగు శరత్కాలంబును నాశక్తికొలది వర్ణించితి, నికమీద నేనేమిపనులొనరింపవలయునో తెలియచెప్పవల యుమహాత్మా !

సూ—బాలా! సుగుణాలవాల! ఇప్పుడునీచేవర్ణింపబడిన శరదృతు ప్రభావంబీయందరి డెందంబులానందింపజేసి నట్టు వీరినెమ్మోము లపై మెలయుచున్న చిరునగవులేసూచించుచున్న యవీనాటకప్రద ర్శనంబున కిప్పటికేకాలాతిక్రమణ దోషంబాపాదించియున్న యది గాన నీవింకజని యేయేకాలంబున కేయేవేషధారుల నాయత్త పరుపవలయునో నాయాకాలంబుల కాయావేషధారుల సిద్ధపర చుము.

(అనిన నటినిష్క్రమించును)

(రంగము-అవంతినగరము విందధరాధిపునికొల్వు)

(పరాక్)—ఉదగ్ర స్వభుజబలనిర్లక్ష్మీకృత సకల రాజాధిరాజప్రతాపసముంచిత కలాపస్వకులదీప బహుపరాక్ అక్షీణకటాక్షవీక్షణ ప్రమోదిత నిజదేశస్థనానావిధమనుష్యవితాన సమస్తసుగుణగణనిధాన యాచక సందోహ పరితృప్యమాణదాన బహుపరాక్ రూపవతీ హృదయారవింద మకరందబిందు సందోహ పానమదవదిందిందిరాయమానసపంచసాయక విలాససుందర మందహాసబహుపరాక్.

రా—(కోరమీసంబు వడివేయుచు)నర్మసచివా! మంత్రిసత్తమా!

మం—చిత్తము రాజోత్తమ

తోడి సంవాదము.

రా—సచివ రాష్ట్రమునకుశుభము। తెల్పుము నాకు। రుచిజనించుగా।
వచనములను దెల్పుము॥సచి॥

మం—శుభము దేశమునకున్నృపతి। కవిరాజగతి। యుభయులకుసుజను
లలరుచుందు రెపుడు॥శుభ॥

రా—కుజనులెవరయినపురినుందురా। మనమాటవిందురా। ద్విజులదే
వపూజజెలఁగునెనిజముగ॥సచి॥

మం—స్వకులధర్మములెవరుబాయక। నున్నారువేడుక ప్రకటితగతి
సంపదలదగియుండిరి॥శు॥

రా—పరనృపభటభయములేదుగా। యపకీర్తిరాదుగా। తరుణులుభ
ర్తలు సరసలనుందురె॥సచి॥

మం—దేనజూచిననాకుకొరత। దోచదుమదిలో। మానవేశయనుమా
నముమానుము॥శుభ॥

రా—కవులెవరైనజూడవచ్చిరే। ననుకీర్తించిరే। తవిలికొత్తవింత
లుకనుగొంటిరె॥స॥

మం—ధరణిచోళ్లేరు పురినిలచి। లక్ష్మీనరశింహా। వరదుడైనహరి
సిరులొసగునువడి॥శు॥

రాజన్యశేఖరా! స్వరాష్ట్రంబునకు పరరాష్ట్ర భయంబించు
కయైన జొరనీక పూర్వోర్వీనాయకులగు గయాంబరీష ప్రముఖు
లరీతి రక్షించుచున్నవాఁడవు, భవత్ప్రతాపం బెంతని వర్ణింతు, శాం
తగుణాలంకృతచిత్త!

రా—శహబాసు! మంత్రిసత్తమా! నీవంటి నర్మసచివుం డుండు
టచేగదా నావంటిధరావరుని పరాక్రమంబు ప్రకాశించుట.

మం—ధరానాథ యికమీద మనమేమికార్యంబు లొనరించవలయు
నో యోచించుఁడు.

రా—ప్రస్తుతమవసరమయిన వ్యవహారంబు లున్నట్లునీచెప్పెడు స
దుత్తరంబులవలన కనుపించవు, మన నగరంబున కాపురం
బున్న వారాంగనలలో రూపయౌవన కళాగాంభీర్యముచేనొ
ప్పి భరతగానవిద్యా కౌశలంబుల మెప్పించగల నొక్కదాని
రప్పించి ప్రొద్దుపుచ్చుము.

మం—చిత్తమాలాగే రావించెద

(వారాంగనప్రవేశించి అలికస్థలివిన్యస్తహస్త యుగళయై)

వా—ఉ. దండము రాజచంద్రజనతానుతసద్గుణసాంద్ర వైరివే
దండమదఘ్నసింహ వసుధాజనకామ్యదరంహఘారికో
దండధరావతంసపరిఖండితసత్కులపాంసబ్రోవుహా
పండితమిత్రపండితవిపాలకపత్రసుధాప్రభాషణా. 40

ధరావర పుండరీక! నాదండంబులు గైకొను సరసుండవని
నీయుండజేరితి మారుండయిన నీదండనుండ సుందరుం డనివేరుండునే
వేదండరిపుసమానశౌర్య!

(అనిపలుకు వెలకలికిపలుకులకలరి కోరమీసంబులు వడవేయు
చుదానిని చక్కగాజూచి ప్రకాశముగా)

రా—మ. చిగురున్బోలిననీదువాతెరకు వాసిన్జందురుండంచున
మృగజాపట్టెడినీదు మోమునకు శ్యామంబైననీవేణికి

న్నిగువౌనీచనుదోయికిన్నడియనాఁబేర్కొన్ననీనాభికి
న్తగపుష్పారెడుమంగళంబులగుకాం◆తానిక్కమెల్లప్పుడున్.

వా—రవిప్రతాపభూపా! నేనొక్కరాగం బాలాపించి యొక్కజా
విడికి హస్తవిన్యాసంబుజూపెద సెలవిందు (అనిన దరహాసి
త వదనారవిందుండై)

రా—కానిమ్ము నీనెమ్మనమ్ము నభయమ్మునబోనిమ్ము.
(తోడిరాగం బాలాపించిజావిడీకభినయించబూనును)

6 అపురూపం—టక ఏకతాళము.

రారాముదముగానాజారా! నాయింటికివేగమే ॥ రారా॥
యేరికోరిన నారిపక్కకు జేరిమదితమిదీర చేయవయో ॥ రా॥
మాలిమితో ప్రతిమాలిననుకృపమాలితివివనమాలిమేలిమిగ॥ రారా॥
కానిమానినిపైన కూరిమిపూని తొలిచెలిమానితివి భళీ ॥ రారా॥
చేరిలక్ష్మీనృసింహా రాయునీకోరి బోచుచోళ్లేరుపురీశ్వరా॥ రారా॥

మహాప్రభో! దేవరవారనుగ్రహించితిరేని యింకొక జావి
ళికిహస్తవిన్యాసంబుచూపించెద (అనినముసిముసి నగవుతో

రా—మంత్రిమహాత్యార్య! స్వతంత్రి! ఈయాటచేడియయాటపాటల
లోమేటి వాటమయిన నీటుగలబోటి ఈబోటితోటి సాటిగ
ల నీటులాడులనేనేడకనివిని యుండలేదుగాన ఈనారికోరిన
కోరికెలొసంగిపొసంగవీడ్కొల్పుము.

మం—ధరాధవచంద్ర! భవదాజ్ఞానుసారంబుగా నావెలవెలందిని
పంపించియున్నవాడ.

(ఇట్టున్న సమయంబున హటాత్తుగా భీకరాకారంబుతో దుర్యో
ధనచక్రవర్తి భటుండు ప్రవేశించి రౌద్రముతో

చ. మఱచితిరేనృపాలనృప◆మండలికిన్విభువై యొకప్పుడు
న్దలుగనిసంపదల్గలిగి◆తద్దయుగొంగలబట్టిపెత్తల
ల్దలిగెడిరాజరాజనకు◆దాత్తతనిచ్చెడికాన్కలివ్వక
న్వీఱుసుతనంబుచేసితివి◆పెద్దయితేభళీయింతలోవలన్

సీ. నిరుపమప్రబలసం♦గరశౌర్యసంపద
వెలుగొందుద్రుపదభూ♦విభునకంటె
కలిమిచేయురాజ్యంబు♦గలిగియుద్ధంబుల
బలశాలియగుబృహ♦ద్బలునికంటె
బలములక్షౌహిణు♦ల్బలసిగొల్వగపెద్ద
దేలినయాశిశు♦పాలుకంటె
హరినైన లెక్కసే♦యకవిదర్భపురంబు
నేలెడురుక్మమ♦హీశుకంటె

గీ. యెక్కువేనీవ్రవారలు♦లెక్కలేక
నిర్ణయంబైనపన్నుల♦న్నియును పెద్ద
పెద్దయేన్గులపైనుంచి♦ముద్దుమీఱ
పంపిరయొనీకుదయ్యంబు♦బట్టెనేమొ. 43

నీ కట్టితాళ్ళు నీచే పెన్చుకొని యున్నవాడవు. ఆ మన్నె దొరనిన్నేమిచేసితే నీవేమిసేయగలవాడవు? నీవర్ధరథుండవు. నీవెంత నీబలంబెంత! ఛీ! ఛీ! నీమొగంబుచూడకూడ దీయుత్తరంబుచూచికొమ్ము (అనియుత్తరంబిచ్చిన మెల్లమెల్లగా చదువుకొనిదీనాననుండై తలయూచుకొని అందరునిష్క్రమింతురు).

ప్రథమాంకము సంపూర్ణము.

శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.



## ద్వితీయాంకము.

(రంగము. విందుడు, అనువిందుడు, నర్మసచివుడు, ఆకాశమునఁబ్రకాశముగా.)



దన్నృపాలనీవు కురువీరునితోఁ బహు వేడ్కఁ దోప సం
బంధము సేయఁ బూనితది పొల్పదు నే కలనైన దేవకీ
నందనుఁ డుండ వేరొకఁడు నాయకుఁడౌనె లసత్ప్రమోదకృ
ద్బాంధవ బృందకైరవసదర్పిత కుందకు మిత్రవిం
దకున్. 1

విం—ఆశ్చర్యమగ్న మానసుండై యేమిచిత్రము! ఈనుడువులు గగనవాణిపలికినది కాబోలు లేనిచో నన్యులెవ్వారిట్లు చెప్పగలరు. (అని యోచించునెడ ననువిందుండు లేచి శంకితహృదయారవిందుండై కొంతసేపూరకుండియన్నఁ గనుంగొని గట్టిగా.)

అ—శా. ఆకాశంబిటు పల్కునేల వినగా నాశ్చర్యముల్ దోపగా
నీకా కౌరవరాజ వల్లభునకున్నిర్ణిద్ర సఖ్యంబుము
న్నే కాలంబున గల్గెదాని వినగా నే వేడెద న్వేడ్కఁచే
నాకాకారణ మెల్ల చెప్పగదవే నాయన్న నాయంబుగన్. 2

అగ్రజన్మ! నాకా కారణంబును సమగ్రంబుగా ననుగ్రహింపుము.

విం—(వ్యగ్రమాన మానసుండై తనలో) నేనప్పుడు వారితో చెప్పిన పలుకులీతనితో చెప్పిన నొప్పుకొనునో యొప్పుకొనడో యొ

ప్పినాయెవ్వరికొనకపోయినా చెప్పకతప్పదు, చెప్పకపోయితే క
ప్పురగంధికళ్యాణం బెట్టులొనగూడును, నీతండు పాండవ పక్ష
పాతి. పాండవులాసుయోధనున కనుకూలురు కారనుసందియం
బందరికిఁ దెల్లమియేకదా, నిద్రబోయినవారి లేపిన తెఱంగున
నందఱువిన్న నాకాశవాణి తెలియబలికెనయినగానిమ్ము మీఁద
జూచుకొనియెదనని తమ్ముఁడా! అనువిందా! చక్కఁగావిను
ము చెప్పెద.

సీ. రాజరాజగు కురుకురాజున కేటేట
మనమియ్య వలసినకధన మొసంగ
కుండిన నతడల్గి దండిఘూరుని నొక
నంపినవాఁడు మహోగ్ర హామున
వచ్చిదురాత్ములకు వ్వారిగాననుబల్కి
వారియుత్తరమియ్యకు చీరిచూడ
వెంటనే రమ్మనుకు విషమాక్షరములందు
కనుపట్టినను మేనుకు కంపమొదవ
గీ. యేరికని చెప్పజాలక యేగియుంటి
ఘూరిభయభక్తి యొప్పారకు వారిగంటి
నేతపల్కిన పల్కులకన్నియునువింటి
నుచిత మనుచితమనక నేకనూరకుంటి, 3

అంతట నారాజపుంగవుం డభంగురహాస రసోల్లసిత ము
ఖుండై ఏమోయి విందుడా! మేమడిగిన నుడువుల కిదియగు నిదికా
దను వాక్యం బొక్కటయిన చెప్పక బెల్లముకొట్టిన ఱాయివలెనున్న
వాఁడ వాపురందర నందనుం డన్నయైయుండ నీవేదండ పురాధినాథుం
డేమిసేయఁగలవాఁడని మదంబొదవిన యెదతోనున్నట్లు తోఁచుచున్న
యది. ఆదండిమగలే కొండలపాలై యుండవారి ప్రాభవంబు నీకే
మిలాభంబుగాన మొల్లగంధియగు నీచెల్లెలిని నాతమ్మునిఁ పిల్లనిచ్చి

హెచ్చిన మచ్చికతో నా యిచ్చదీర్చి మనుమని వత్తివత్తి పలికిన నా డెందంబందు జెందిసుందరాంగి నిచ్చెదనని వచ్చితి లేకున్న యీ కన్నెతో రాజ్యంబు చేకొనునందు కెందును సందియంబు లేదు. (అనినన్దొండంబు వట్టియీడ్చిన మండిపడు వేదండంబురీతి గద్దియపై నుండి దిగ్గన లేచి)

అను—సీ. అమరేంద్రముఖులతో • నాహవంబొనరించి
ఖాండవంబేర్చిన • ఘనుఁడెవండు
మాయాకిరాతుఁడై • మలసిన హరుని మె
ప్పించి పాశుపతంబు • గాంచె నెవఁడు
కాలకేయనివాత • కవచులనొంటియై
(మందించి కోటీర • మందె నెవఁడు
ఘోషయాత్రలో దన్నుఁ • గొనిచన్న గంధర్వు
నదలించి విడిపించి • నది యెవండు
గీ. ఇంతలోపల మఱచెనే • యింద్రతనయు
శౌర్యధైర్యాది గుణముల • సారమెల్ల
ధనము హెచ్చిన మదమెచ్చు • ననెడి మాట
తప్పనే యెరికైననీ • ధరణియందు. 4
మ. అదియెట్లుండెనటుండనిమ్ము మనమ • ర్యాదైన యోచింపకు
న్మదవృత్తి న్నిలిపించి పిల్లనడుగ • న్న్యాయంబె వీఁడొక్కఁడె పె
ద్దవారే దాసీసుతుండు తోడెడలిన • న్దా నేమి టన్పొందునో
మదరాజన్యులవల్ల నప్పనములన్ • మర్యాదతో నెల్లెడన్. 5

అప్పుడు నీ కెందుకు నోరలేవకున్నయది యో దోచకున్నయది. ద్రౌపదీ స్వయంవరంబు మొదలయిన స్థలంబులలో దానుపొందిన పరాభవంబులేల నుదహరించకుంటివో యప్పుడతండు జంపునని కాబోలు. రాజులకు చచ్చుట చంపుట సమానధర్మంబులని మీరెన్నడు వినియుండరేమో యీవరమకిరాతక సుతునకు మనసరోజాక్షి నిచ్చుటకంటె చిచ్చులో పెట్టుట మేలుగాదె! యచ్చపలనయనకుం దగినవ

రుండు కృష్ణుండుతప్ప మనుష్యమాత్రుండొకండు కలండే యని నా
యభిప్రాయంబు తెలియపర్చుచున్నవాడ (అనిన సంచలిత మనఃపం
కజుండై తమ్మునివంక జూచి.)

క. పిలదవునీవు కసరున
ప్రల్లదములు పల్కనవియె భాష్యములనినా
యుల్లమున నమ్మి నను బుధు
లెల్లను హర్షింతురయ్య హేయములనక. 6

క. చతురంభోధి పరీవృత
క్షితియెల్లను నేలునట్టి శ్రీమంతునితో
ప్రతిహతముగ మాట్లాడిన
కుతుకలు కోయించకున్నె కుయ్యోయనగన్. 7

ఉ. ఎక్కడికృష్ణుఁ డెక్కడొక యేలిక యేమన కెన్నఁడేనియు
టక్కరి పరాక్రమంబులఁ జెలంగుచు బానల బండ నెద్దుల
స్నిక్కలపెట్టి చంపుటలు చిత్రములయ్యెనె నీకు మంచిరా
జెక్కడఁ జిక్కెఁ జెల్లెలి నిచ్చినచూపరు లెన్నఁ కుందురే. 8

ఆహా తమ్ముఁడా! యనువిదుండా! రాజరాజై మహా ప్రఖ్యాతి
బొందిన దుర్యోధనచక్రవర్తితో శత్రుత్వంబును, రాజ్యవిహీనుండై
యదురాజులలో బెరిగిన కృష్ణునితో మిత్రత్వంబును కొఱివితో త
లగోకికొనినట్లుగను గాన నాయిష్టంబునకు కష్టంబు చెప్పకుము.

(అని తమ్ముని మొగంబునందు దృష్టినిడి మేఘగంభీర భాషణం
బులతో.)

క. పెద్ద యొనరించు కార్యము
వద్దని చెడగొట్ట పిల్లవానికి తగునే
యెద్దో జేసితి దానిని
ముద్దుగ గనుగొమ్ము యింత క్షోభణం బేలా? 9

(అనిన తోకద్రొక్కిన నెగిరిపడుపిల్లి తాచువలె బుసకొట్టు
చు చేతికరవాలంబు మెఱపించుచు)

అ—అగ్రజావిందభూభుజా.

ఉ. ముద్దులచెల్లెనయ్యొ పెడకమూర్ఖుని పుత్రునకిత్తునంచు నీ
బుద్ధికినెట్లు తోచెనటు బోయెనుముందటి తెల్వితోటి
నీపెద్దతనంబి కెవ్వనికి పెద్దపు శ్రీకృష్ణుని కిచ్చువాడె బ
ల్పెద్దగుటబ్బమేయతడు పిన్నతనంబున నున్నచూడగన్. 10

సీ. లక్కయింటనుబెట్టి లలిమనపెదతల్లి
కొమరులగాల్చిన కూళమతులు
నిద్రబోయెడుభీము నీరధిలోత్రాళ్ళ
కట్టిముంపించిన కలుషరతులు
ద్రౌపదీపరిణయోత్సవ వేళనర్జును
నిందించునట్టి దుర్నీతియుతులు
కష్టంబులెప్పుడు కల్పించివారల
దూరద్రోయించిన ద్రోహగతులు
గీ. ఇట్టివారలతో పొత్తు బెట్టుకున్న
ఇట్టినీదిట్టతనము నేడుట్టిపడియె
చిట్టచివరకు తల్లితో బుట్టువులకు
వట్టిలేనట్టిపనితల బెట్టితహహా. 11

(అనిన పలుకులు చెవులకు ములుకులై దోప పండ్లు పటపటన్నొ
ఱుకుచున్నమ్మునిద్వ్రణీకరించి చేతికత్తి విసరుచు మంత్రి మొగంబు
చూచి)

విం—ఉ. వింటివె వీనిమాటలు నవీనములై కనుపట్టెనల్లము
క్కంటినినైన బోరిచెనకం దగు విక్రములున్న వారు వా
రింటను నిట్టివారిని హిహీయని పండ్లిగిలించి పల్కిన
న్గెంటరె రాజ్యమున్సిరులొగ్గొని భూపతులెల్ల నవ్వగన్.
సీ. తమపాలు సాధింపదరము కాకను కదా
పాండవులడవిలో పల బ్రదుకుట

అవును కాదనిచెప్పఁవలవి కాకనుగదా
ద్రోణాదుల తనికిఁదోడుపడుట
యెదిరించి పోట్లాడఁ నేపులేకనుగదా
వసుధేశులందరుఁ వశ్యులగుట
యిల్లుండ్లపై కూర్మిఁ నడగించుకొనికదా
శల్యుఁ డాతనితోడఁ సంధిగనుట
గీ. పెద్దపెద్దలె భృత్యులై పేర్మిఁదక్క-
యెప్పుడే మాయటంచుఁ గొలుచుచుండ
నీతడట వారికివ్వఁగ నీతిలేని
వానికెవ్వనికో నివ్వఁబూనెనంట. 13

మ. హరి సద్విక్రము డయ్యెనేని మఱుఁదుల్లాయించుఘోరాటవు
ల్దిరుగన్నెల్లెలినింట నుంచుకొనియర్ధిన్ప్రేమ బోషించునే
కురురాజున్వడిగిట్టు తమ్ములు సుతుల్గొల్లెత్త రాజ్యంబుని
ర్భరవృత్తిన్దమవారికివ్వఁగ వృథాపంతంబుతో నుండునే. 14

కావున యగ్గిరిధరుండును యగ్గిరిధర సోదరీవరుండును మహాపరాక్రమశాలురని యీవిక్రమవిహీనుం డురకనరచుచున్నవాఁడు. వారిశౌర్యంబులేనెఱుంగనే? ధైర్యసాహసాదిగుణంబులకు రాజరాజునకె నయయిన వారీరేడుజగంబులలో లేరు, ధర్మరాజునకు దండ్రియముండును. భీమునకు జనకుండు వాయుదేవుండును నర్జునునకు తాత పురందరుండును, నకుల సహదేవులకు తండ్రులశ్వనీదేవతలును, నై యుండియు తనిజెనకలేక మిడుకుచున్నవారు వీరలందరిలో వీడెందునబోలువాడో తెలియకున్నయది. వీనిరంకెలు నాకొకశంకయే? నిష్కళంక చంద్రముఖియయిన నాసోదరీమణికి, దుశ్శాసన కుమారుండగు లక్ష్మణుండే భర్తయగునింక సందియంబెందును లేదువాడువచ్చినప్పుడెవ్వరేమిసేయంగలవారో చూచెద. (అనిసరోషకషాయతాక్షయుగళుండై చలితోష్ఠద్వయుండై నర్తసదివున్నముంగొని కోరమీసంబులు వడివేయుచు

అ—నర్మసచివా! వినుచున్నవాఁడవుకదా.

సీ. ఏచేట నింద్రుని కెలమిచే సెడియాఁగ
నెవ్వఁడు తనకుఁ జేకయించుకొనియె
జడివాన నడఁకున కడఁడియ గొల్లలఁ బ్రోవ
నెవ్వఁడు పర్వతంబెత్తెఁగోట
గోవత్సములఁ గోపకుల బ్రహ్మదాచిన
నెవ్వఁడా రూపంబులెత్తి తిరిగె
నతి భీకరాటవి కనడరు కార్చిచ్చును
నెవ్వఁడు మ్రింగి మేలెనసియుండె

గీ. నిట్టి కార్యంబు కురురాజు లెవ్వరయిన
చేసియుండిరె నిపుడైన జేయఁగలరె
యహహ మాతులపుత్రుఁడై యలరుకృష్ణ
మూర్తి యగు గాత మాచంద్రముఖికి భర్త. 15

అమ్మహాత్ముని చరిత్రమ్ము లిమ్ముగా బొగడ నలుమొగంబుల పోడకైనం దరంబుగాదననే నెంత! యాగొల్లపిల్లల యుల్లంబులు పల్లవింపసేయుచు మల్లికాశరుని జక్కులఁ దొరపిల్లని మల్లసమూడు సోయగంబుగల యాయదువల్లభునకే నాచెల్లెలినిచ్చి పెంచ్చునకీర్తి గాంచెద, యాసింహశౌర్యుండరుదెంచి నీలవేణి న్పాణిగ్రహణంబొనర్పుతరి వారు, వారివారు యేమిసేయుదురో చూచెద.

(ఇవ్విధంబున నన్నదమ్ములిద్దరు రోషావేశ ముఖంబులతో కూర్చునియుందురు నారదుండు సంగీతముతో హరిస్మరణ సేయుచు ప్రవేశించును.)

7 రాగం హిందూస్థాని శ్రీరూపకం.

నా—రాధికామనోవిహార । రత్నహారరమ్యకేయూర॥ రా॥
పాదానతఖచరజాల, సాధులోలసత్యశీల॥ రా॥
నందగోపబాలనీల। కందనీలకనకచేల।
నందబృందా సంచారధీర భీకరారిగర్వదూర॥ రా॥

పుండరీకసదృశనేత్ర। భూరిశకటదైత్యజైత్ర।
భండనప్రదీప్తబాణ। ప్రస్ఫురన్మహాతితూణ॥ రా॥
ధారుణీచోళ్లేరునగర। ధామపాదవినతసగర।
ధీరతాడేపల్లిలక్ష్మీ! నారసింహరాయ వరద॥ రా॥

వి౦—అ—సకలవిద్యావిశారద నమస్కరించుచున్నారము

నా—సంగ్రామవిజయమస్తు, సకలకార్యసిద్ధిరస్తు.

రా—మునీంద్రా యీ మణిమయాసనంబునందధిష్ఠింపుడు.

నా—కం. చతురంగంబులునద్భుత
గతినుండునె రాజ్యపదవికడుసౌభాగ్యంబే
సుతులును సుతులును నిద్దరి
కతులితగతినున్నవా రెయన్నిటమేలే. 16

వి౦—దేవా కర్మందిప్రవర! భవదనుగ్రహవిశేషంబున కొఱతలేమి
యులేక నే కాలంబు గడచుచున్నయది, భవదాగమనంబెచ
టనుండియో యిక్కడికో యింకెక్కడికో తెలియకోరుచున్న
వాడ. సెలవివ్వుడు, ఈదీనుండెఱింగి సంతోషించెడిని పరమ
భాగవతకులావతంస!

నా—చం. హరికడనుండి వచ్చితి సహోముదమొప్పగ నేడుమీసహో
దరిపటు సుందరబు వినిదైత్యవిరోధి మదిన్భ్రమించిత
త్తరపడి మారుబారికెదతాళగలేక నలంగిపంపెన
న్నరుపడి యాపె నోములుశుభంబుగ బండెగదయ్య యేమనన్

(అనినవిందుండతి చమత్కృతితో దమ్మునిజూపి)

వి౦—ఉ. ఇంతకుముందె నన్నునతిహింసముపల్కులధిక్కరించితా
నంతయుసేయబూని కరమందునకంకణ మూనియున్నవా
డంతటికాతఁడేయతనికానరసి చూడుడి యాతడెట్లయో
చింతమటన్న నందరముసేయుదమట్లనె మోదమొప్పగన్. 17

(అనిన దరహసితవదనారవిందుండై యనువిందుని గనుం
గొని)

సా — రాజకుమారా! అనువిందా?

కం. మెల్లగ హరిబంపిననీ
చెల్లెలి కయి వచ్చినాడఁ జెలువొప్పగ నా
నల్లని సామికి యిచ్చిన
చెల్లదె ముల్లోకములను జిరతర కీర్తుల్. 18

మీ యన్నమాటలు వింటివి కదా! నీ యభిప్రాయంబేమి (అని నతఁ డంజలీబద్ధహస్తద్వయుండై) చెప్పదనూల్కొనుడు

కం. నెయ్యమున రాజరాజుతో
వియ్యంబందంగఁ గోరి విస్ఫుట గతితో
నొయ్యన జనియని వచ్చెము
మయ్యెడి నా చెల్లెనీకుఁ గోడలటంచున్. 19

ఆవృత్తాంతం బెవంత యయిన నాతో చెప్పక నుప్పతిల్లుచున్న నేకారణంబుననో యాకాశవాణియాయన పేరెత్తి నీవా కురురాజుతో కోరి చేసుకున్న చక్కచక్కపడునే, పల్లవాధరయగు నీచెల్లెలియుల్లంబు రంజిల్లఁజేయ నావల్లవ మొల్లగంధుల మనోవల్లభుండగు కృష్ణుండు తప్పతక్కన రాజవల్లభుం డెవ్వఁడయిన సమర్థుండే యని యాకారకుండె పిమ్మట యాసంగ తెఱుంగ కోరిన కౌరవపక్షపాతుండై కమలేక్షణ నాలక్షణుని కివ్వ నిశ్చయించి యున్న నాచిత్తంబామత్తచిత్తులయందు హత్తకగుణోత్తరుండయిన హరికియ్యవ్వబూనియున్న, ధిక్కరించి తానెక్కడుండే యక్కరాతుల కిచ్చెదనని రాయి గుద్దుచున్నవాడు నేనంతకంటె గంతులు వేయుచు రుక్మిణీకాంతునికే జవ్వని నివ్వబూనియుంటి నింతలో చుక్క తెగిపడ్డట్లు మీరిక్కడి కరుదెంచితిరిక మీయిష్టానుసారంబుగ స్పష్టపరుచుడు. (అనిన దరహసితవదనారవిందుఁడై తనకరద్వయంబుచే వారిరువురి చేతులూని యొక్క గద్దియపై కూర్చుండ నియమించి తాను వారి సన్నిధి నుచితాసనంబుననుండి మందమధురాలాపంబులతో.)

నా—సీ. ఒకమాట రజమున౯ నొప్పంచుభువనని
ర్మాతయై ధాతయై౯ కమలయోని నెవ్వ
డొకసారి సత్వంబుఁ నూని లోకావన
ధూష్ణుడై విష్ణుడై౯ పాలుచు నెవ్వ
డొకతేపతమమాత్మ౯ మెఱయుజగత్త్రయో
న్మూలియై శూలియై౯ మురయు నెవ్వ
డొకపరి త్రివళి౯ యుపకయోనిధిలోఁ తమ్మి
కంటియై యొంటియై౯ కడగు నెవ్వ

గీ. డతనికంటెను జగములే౯ కానె జగము
కంటినాతడు వేరానెఁ కంటెపింటె
తొంటిరాజులు హరికృపఁ యుంటిగాదె
పుట్టుచావులు లేనట్టి౯ మెట్టనుంట. 20

అమ్మహాత్ముండు దుష్టజనశిక్షయు శిష్టజన రక్షయు చేయుటకై కదా యనేకావతారంబులెత్తి యిప్పుడో దేవకీవసుదేవుల యశోదానందుల పూతచరిత్రుల చేయుబుట్టి రుక్మిణ్యాదిజగదేక సుందరీమణుల నైండ్లియాడి స్వబలవిశేషంబున సముద్రంబులో పట్టణంబుగట్టుకొని మహాప్రతాపశాలియై వెలుంగుచున్న కృష్ణునిన్వర్ణింప నెవ్వరోపుదురైన నానేర్చుకొలంది కొంత చెప్పెద సావధానచిత్తులై వినుండు.

క్షీ. మాంసలదుర్మద౯ కంసధరాధీశ
కృత కిరాతకపూర్తిఁ కృష్ణమూర్తి౯
యక్షీణ కరుణాకటాక్షవీక్షణావిని
ర్జితభక్తజనతార్తి౯ కృష్ణమూర్తి౯
యుద్ధవాకూర్రాదిసద్ధర్మయుతజన
హృదయకమలవర్తి౯ కృష్ణమూర్తి
పూతనస్తనవిష౯ వార్పితపానాతిత
పృథుబలయుతకీర్తి౯ కృష్ణమూర్తి

గీ. సకల సంపన్నికేతనఁ జక్రముఖర
ఋభుపరివృత్తైల వరవర్తిఁ గృష్ణమూర్తి
అసమ విశిఖప్రయోగమాఁ గాంతివిజయ
కీరవాహన నిభమూర్తిఁ గృష్ణమూర్తిఁ. 21

ఉ. అమహనీయ మూర్తికి సమంచితకీర్తికి నిర్జితార్తికి
న్నైమనుశాటికి న్నుషితనిర్జరకోటికి శౌర్యపేటికి
న్నామితదాయికి న్పృథజనస్తుతిపాయికి శేషశాయికి
న్స్త్రామమహిళానుకూలికి వినమర్దితమాలికి భక్తపాలికిన్. 22

ఉ. చక్కనివారి కందరికిఁ జక్కనివాఁడు యదుప్రభుండుమీ
చక్కరబొమ్మ యున్నిగుల చక్కనిదందరికంటె జూడగా
చక్కనివారినిద్దరినిఁ జక్కగఁ గూర్చిన నన్నికార్యము
ల్చక్కనకావె కోర్కెకొనఁ సాగదె యేరికి నైనఁ జూడగన్. 23

వింద ధరాధవ చంద్ర గోవిందుండు మీమామనందనుండే కదా యీ కందర్పసుందరున కమందానందంబున మీచెల్లెలి నిచ్చి యీపెల్లిదుని ఇచ్చదీర్పుము. నేను వచ్చినదందుకే యాగోపాలుం డాపరాని మరులెక్కియున్నవాఁడు. పందియంబేల (అనిన నిచ్చుట కిచ్చలేక నివ్వననుటకు వీలులేకఁ గొంతసేపూరకుండి) మునీంద్రా యొక్కమనవి చేసుకొనుచున్నవాఁడ సమగ్రానుగ్రహంబున మన్నించవలయు.

విం—క. హరిబావమాతు నాతని
కరుణా పాత్రులము మేముఁ గాదనగలమే
కురురాజు తోడబల్కిన
సరసంబులు విరసములయిఁ జరగ వెకలతల్. 24

ఆతని పాలనంబులోనున్న మేము నాతనినివ్వాక బాంకి యింకెక్కడనుండగల మాతండు దండిమగలతో దండువెడలి నప్పుడే పుండరీకాక్షుండే యాఖండలపుత్రుం డడ్డపడి జడ్డిగంబులు కాపాడెదరో తోచదు. వాచంయమివర్య! మీబోటి పెద్దవారలవ్వాడు కాన్పింతురేగాన పరులమాటలు నమ్మి సిరులు పోగొట్టుకొనువారెవ్వారైన నివ్వసుధా

వలయుంబున న్గలరే విూరేచెప్పుడు. ఇందుకొరకై సందియించు చున్నఁవాడ.

(అనిన నతని చేతోవృత్తికి చిత్తంబున గర్వించుచు కానీచూతము. వీనికి దగినయుక్తి చెప్పెదనని)

నా—విందభూపతివర్యవినుము.

క. మీయిద్దరిడెందంబుల
 నీయెడ భేదంబులుండకనెట్లగుమీమీ
 స్వాయత్తప్రతినలు దప్పక
 సేయుదు నేనొక్కయుక్తిఁ చెప్పెదవేడ్కన్. 25

ఒక్క శుభముహూర్తంబునిర్ణయించి స్వయంవరంబనిసమస్త దేశాధీశులకు న్దెలిపిన నందఱరుదెంతురు. నాటిరోజా చంద్రవదన నెవ్వరి వరియించితే వారే భర్తయగును. అప్పుట న్బలవంతుడైన వారినే కోరుకొనుగాని యాలుహీలులేనిబేలనేల యాంబాల మెచ్చునీప్రకారంబా స్వయంవరంబు నెరవేరిన నెవ్వరికేమి కోపంబులు రావుగాన నామాటకు సమ్మతింపుడు. (అనిన వారిద్దరు సంతోషించుచు నేకకంఠులై చేతులుజోడించి.)

క. బాగాయెమీవచస్థితి
 రాగాది గుణప్రభంగకరమ్యద్గతివలె
 యాగమను మాకుసౌఖ్యో
 ద్యోగంబై దోఁచెదివ్యయోగానందా. 26

నా—రాజకుమారులారా మీసోదరీ రత్నంబగు మిత్రవిందతో మాట్లాడిపోయివచ్చెద దయయుంచుడు.

(అందరునిష్క్రమింతురు)

(రంగము విచిత్రసౌధము దోమతెర మంచముమీద నిద్రపోవుచునుండవలయును నిద్రలో)

మి—చ. ననువిడనాడి పోవతగునే నాదిగునావగ నాదుమక్కువ
కనికరముంచవింత పెట్టుకాకటుకావిట కాడయుట్లునే
మనగలదాననయ్యొ హటకేమావిట మామటు మాయకాడక్ర
న్ననను బాసి నిల్వగలనే నా తలనాకలనైన జాడగన్. 27
(అనువాక్యంబులు చెలిక త్తెలువిని యులిక్కిపడి హాశ్చర్యమ
గ్నమానసలై చేరంజని పిలిచినపలుకకున్నగట్టిగ).
తల్లీ తరుణీమతల్లి ఏమియో పలుకకున్నదానవు లెమ్ము.
(అనునంతలో)

మి—క. ఏరాపోయెదవిడితగ
వేరాబిగి కౌగిలివ్వకే వేరాచార్చా
లారా నమ్మినదానిని
రారాపులు సేయుమేరకే రాయుతహారా. 28
ఛీఛీ చేడియలారా పోవుచున్నజా చెదరా నామేఘమింక మే
లుగానట్టు తోచుచున్నయదేమీరను పొండు (అనుమాటలకాబోటు
లు నీటులు చెడికొంతసేపు యోచించి యీయందులో కీరవాణి యిదికల
కాబోలునని సమీపించి పన్నీరుచే కన్నులుతుడిచిన దిగ్గునలేచి దిక్కు
లుచూచి సిగ్గుపడి తలవంచుకొని యున్న రాజపుత్రినుంచి తక్కినవా
రినందరి నవతలికిదోచి)

8 భైరవి ఏకతాళం,

ఇదియేమిచిత్రము॥ ఇది॥ మదవతియే మోమాట్లాడెద॥ విది॥
పరిణయమెనయని వడుచుపయియె పరపురుషునిబిలిచిన వరు
సబలికె॥ విది॥

ఇటునటు చెదరని దిటమగు మదిగల కుటిలదికరలిప్పటి వ
నితగ॥ విది॥

సాటిబోటులీమాటవిన్న నగుబాటుసేతురెచ్చోటనైన॥ విన
లలితాడేపల్లి లక్ష్మినృసింహోజ్వల నుతచొల్లేట్పతి హారిగల॥

చ. మొగమొకరీతితోఁజెనుకమోవివిలాసముతగ్గిచన్నుల
న్దగిలినపుష్పమాలికలుఁదారకములూడకరాలెపక్కపై
సొగసుగచెక్కుటద్దములుఁజూపడెవింతలుగొన్ని తెల్పవ
ల్కగనగునమ్మ నేనువినఁగాతగుదానను గాననెచ్చెలీ. 29

నన్ను బెదరించదలంచి యిన్ని చిత్రంబులీవే కల్పించుకొని నట్లు తోచుచున్నయది లేనిచో శుద్ధాంత సౌధాగ్రంబుపైనున్న నీకెట్లుపొ సగుగాన నున్నదున్నట్లు చెప్పవే యొప్పులకుప్పా.

(అనిన తనమనంబున నుఱ్ఱట్లాడిన సిగ్గుగగ్గోలుసేయు తనలోతా ను) అహా! కలలోఁగలిగిన రతిసౌఖ్యంబు లేమనిసెప్పుదు. చెప్పిన నీక ప్పురగంధి తప్పుగానెంచి వెలిపించునేమొ ఛీ! ఛీ! ఇట్టిరహస్యంబు లెం తప్రాణస్నేహితులకైన తెలుపతగదు. (అని కొంతసేపూరకుండి) యెంత వెఱ్ఱిదాననైతిని. నాపంచప్రాణంబులలో నొక్కప్రాణంబు గానుండి నాకుమేలుసేయఁగోరి యొక్కనిముషంబైన బాయని యీనె చ్చెలి కంటెమచ్చికగల వారెవ్వరు. చెప్పెద. చెప్పి యీయొప్పులా డినిలోఁబఱచుకొని మదీయమానధనంబు హరించిన నాచోరుని నేతీరు నైన భావించుకొని మోహంబపనయించుకొనుచుండెద నొక్కరైనన్ను ట్టుదెల్యని ఇట్టులలేనట్టయితే కార్యంబుచెడి చిట్టచివరకు రట్టుపడి గట్టుకొనవలసివచ్చు (అనియోచించి) సఖీకీరవాణీ రమ్ము.

చ. ఒకకలగంటినమ్మవికచోత్పలలోచనియొక్కసుందరుం
డకలుషరీతివచ్చిబిగియారగకౌగిలిగ్రుచ్చిమోవిపా
నకమునుద్రావియద్దములనందగుచెక్కులుముద్దువెట్టిసా
రెకు జనుదోయిముట్టుచుమఱిన్మరుకేళినలర్చిపోయెనే. 30

ఉ. నవ్వుమొగంబు వాడుమదిఁనమ్మకము ల్పరించువాడుమే
ల్జవ్వనమొప్పు వాడుకనుఁసన్నలకూరిమినించువాడుబ
్రలవ్వలసొమ్ము వాడుకనుఁలందెలితమ్ముల నేలుతావునూ
పువ్వును ధిక్కరించునునుఁముక్కుఁగల్గిన వాడుసుందరీ. 31

ఉ. నల్లనివాడు చారు♦వదనంబున సన్ననిబొట్టు వాడువి
ద్యుల్లతబోలు చేలమెఱ♦నొప్పినవాడు కృపారసంబుపై
జల్లెడువాడు వక్షమున♦జానగుమాలికెవాడు చల్లనౌ
మెల్లనిమాటల న్మనము♦మెచ్చగచేసెడు వాడుసుందరీ. 32

ఉ. మారుడుకాడు శక్రుని♦కుమారుడుగాడు తలంపగోహిణీ
జారుడుకాడు కిన్నరవి♦చారుడుగాడు కుమారి వారల
న్వారక మెచ్చ నట్టిపయి♦వారలనైన నిరాకరించుహా
వారిజనాభు వంటిమగ♦వారలుగల్గుదురమ్మ భూస్థలిన్. 33

క. మదనుని కదనమ్మునక
మ్మదనం బాగిజూపిచని యొకమగువా వినుసీ
యెదనొచ్చుకు వచ్చెదనని
యెదయమది న్మఱచెనోరకహీన్వచ్చు నకో. 34

(అని ఆత్మగతంబున) నేనెంత వెఱ్ఱిదాననైతినక్కటా! పట్టి
చూచినమగవాడును, పెట్టితీసినసొమ్మును మునుపటట్లు ప్రకాశించ
వనుమాటలు, బూటకంబులౌనా యెక్కడికల, యెక్కడిగోడుయీ
పుట్టువున నికనట్టివానిని చేపట్టుదునా! యన్నలంతవానికి నన్నిత్తురా!
(అని చెలికత్తియఁజూచి) కీరవాణీ! నేనా సుందరుని గట్టిగా పట్టుకొ
ని యుంకవలసియుంటి. అందుకి స్వెరచి మానుకుంటి, అక్కా నీ
వెక్కరణినైననవ్వాని సుందరకులశీల వయోలావణ్యంబులెల్ల, నాయ
న్నలకుజెప్పి నన్ను వానికేయిప్పించి నాచే మెప్పొందవుకదా, నీక
ష్టంబునకు ప్రతిఫలంబొసగనా, యేది యోచించుము. (అనిన కీర
వాణి తనలో తాను నవ్వుకొనుచు, ఇది గోవిందునిమాయగాని మరొ
క్కటికాదని యారాజకుమారి న్బుజ్జగించుచు)

కీర—కుంతల కాంత్యపహసిత షట్పదబృందా మిత్రవిందా.

చం. మదినిక జాలిజెందకుకుమారికలన్గనుపించువాడునీ
సదనమునందునుండునెవిచారమొకింతయులేకబల్కెదో
మదవతితత్ప్రయత్నమికమానకచేసిభవత్కటాక్షసం
పదజరియింతునీకికశుభంబగుసందియమేలకామినీ. 35

తల్లీయూరడిల్లుము. ఇకయీపనిదప్ప యొండుపనినాకేల

(అని అందరునిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సంపూర్ణము.



నార — శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు మనోవాంఛాఫల సిద్ధిరస్తు.

శా. రాకాచంద్రునిబోలు మోముతెలుపై రంజిల్లు కందమ్ముల
న్నేత్రాకారంబులనేలు కర్ణయుగము న్జెల్వొందు కన్బొమ్మలు
న్నోష్ఠకాల్మ్రదికిజారు కేలుగవయు న్బొల్పారు కృష్ణుండిక
న్నీకాంతుండగు నిక్కమీపలుకు నిర్ణిద్రస్థితి గ్గామినీ. 1

శా. నీతారుణ్యము నీయొయ్యారము నీనీటు న్నీనంబొల్పునీ
సేతల్నును మోవి నీసడుము నీచిత్తంబును న్నీనడల్
శీతాంశుప్రభమియించు నీమొగము వాసిన్నెమ్మదిన్మెచ్చగా
నాతో జెప్పెను నిన్ననందుకె కదా నారాకడల్మానినీ. 2

రాజపుత్రీ! నీపూర్వపుణ్యఫలం బేమని చెప్ప శంకరపంకజాసన ప్రభృతి సమస్తదేవతా కోటీరకోటి సంఘటిత మహామణిప్రభా ప్రభాసిత పాదపంకజుండగు వాసుదేవుం డపరిమితానంద కందళిత హృదయ పంకజుండై నీచక్కదనంబునకు మెచ్చి పరిగ్రహించదలంచి నాతోచెప్పిన నేనలుదెంచి నీయన్నలతో సంభాషించి దుశ్శాసన పుత్రున కివ్వవలయునని నీపెద్దన్నయు, కృష్ణునకే యివ్వవలయునని నీచిన్నన్నయు కొట్లాడ వారిపోట్లాటమాన్పి యేకకంఠుల జేసి స్వయంవరంబున నీయిష్టమైనవారి వరియించునట్లు కట్టుదిట్టంబు లేర్పర్చి నిన్నుజూచి పోగలందులకై వచ్చితిని. నిన్నుమెచ్చితిని. మచ్చెకంటి!

(అనిన పులకాంకురిత సర్వశరీరిణియై పునఃపునః ప్రణామంబులొనర్చి తేనెలొలుకు పలుకులతో)

మి-చ. మింటికిదాకుపెన్నపమమేయగతిన్నడచేసి వేడిన
న్గంటికిగానుపించనియఖండలమూర్తివినీకునీపెనా
యింటికివచ్చికృష్ణుడుమదీశ్వరుడౌననిపల్కవింటినా
తొంటిభవంబునన్గలుగుతోరపునోములపంటపట్టిదో. 3

(అనియాత్మగతంబున) ఏమీ నాపూర్వపుణ్యంబు. ఈ మహానుభావుం డలుదెంచి జగన్మోహనుండై వెలుంగు వాసుదేవుండు నన్ను వరించునని చెప్పె. ఈవాక్యంబు లెంతనమ్మకంబులో చెప్ప

జాల (నని కొంతవడి యూరకుండి) నాకంతకంతకు తెలివికలుగుచున్నదే! కేవల బ్రహ్మమానస పుత్రుండగు యీతపసినుడువు నుడువు లొక్కటియైనం దప్పిపోవునా, పోవు. దీని నిజానిజంబులు మదీయస్వప్నంబే స్పష్టపరుచుచున్నది. (అని హార్దిక్షారస సదృశంబు లగువాక్యంబులతో)

చం. ఇవినిజమైన పల్కులె మునీశ్వర! రుక్మిణి సత్యభామ జాం
బవతి దినేశ పుత్రివర భద్రసులక్షణ నాగవిస్ఫుర
త్కువలయ నేత్రలుండ ననుఁ గోరునె కోరిన వారుకోపము
ల్దవులక నుందురే మదిముదంబొడప న్గరుణించి మ్రొక్కెదన్. 4

(అని, మొగంబున చిరునవ్వొలయు)

శుద్ధకాంభోజి—ఆదితాళము.

నా—ఏలబాల బేలవై తివిక-నామాటలు నమ్మక।
ఆలోక సుందరుని కాంత-లేలోలలోచనులు త్రిప్ప।
జాలరు వెన్నోలను గోప-బాలుడు నీపాలవు నిజముగ నేల॥

మి— నెమ్మనమ్ము నమ్మదిప్పటికి-మీరెన్ని చెప్పిన॥ నె॥
తమ్మిగద్దియ కొమ్మ యె-రుక్మిణమ్మ నుచు వింటిని హారియా।
యమ్మకు వశుడు కాక నారూ-పమ్మునకు భ్రమజెందునె చూడగ।

నా—క్రొత్త క్రొత్తబిత్తరివి నీవు-కనులార జూచినక్రొత్త।
యుత్తెరవల కంటెయుంద-కత్తెవంతియు కాకనుమే।
నత్తకూతురవు నీపై-హత్తును హరికిచిత్త మెప్పుడు॥ యేల॥

మి—నిన్న మొన్న యున్న వారుక వా-యాలేమ లందరు। ని॥
పన్నుగ నెక్కరైను కొ త్త-యున్నవను పోయి వారల।
మన్ననలు తెల్యక సిగ్గున-నున్న నేరము లెన్నక నుందురే॥ నె।

నా—వారి జేరి కేరుచుండెదవు-సిగ్గెన్ని నాళ్ళు॥ వారి॥
కోరిన కోరికెలు-శౌరి చేరి దీర్పుచుండగ గడి।
శేరినారిమే మెవుడైన-గోరివచ్చిన మాట్లాడవకో। యేల॥

మి—యేరికోరి భూరితేజమున-చొల్లేరుపురమున॥ నేరి॥
జేరితాడేపల్లిలక్ష్మి-నారసింహరాయునకు।
కోరినకోరికలిచ్చు-సారసలోచనునిమా॥ నెమ్మ॥

కం. ఇమ్ముమొక మంత్రరాజము
సమ్మతితో శౌరినాథుఁ స్వాధీనుండై
యెమ్మెలుగుల్కఁగ ప్రతిదిన
సమ్మోగినాయింటనుండఁ సద్గుణకాండా. 5

నార— (అని నవ్వుకొనుచు తనలోతాను) ఈచిన్నదా వన్నెకాని మొగమున్నచోటైన నెఱుఁగదే! యిప్పుడేయింత మరులెక్కియున్న దన్ని కార్యంబులారి తేరినచో నక్కమలాక్షుని బలంబొక్కసారి గుటుక్కన మ్రింగునేమో యబ్బబ్బా! యీబిబ్బోకవతి దెబ్బ (అని తలయూచుచు)

మ. తరుణీదక్షిణనాయకుం డతఁడు కాంతల్కోటి మందైన బం
ధురపంచాస్త్రకళారహస్యములలోఁ దీరంబుగానందరి
న్నరమొప్పారఁగ నేలుచు న్నమితరంగత్కేళిఁ దేలు న్నుమీ
కరిభాస్వద్గతినీదుకోర్కెఁ బిదపన్నావింతు సైరించుమా. 6

బాలికామణీ! నీవింక సంతోషముననుండుము. నీకోరికె లీడేరు కాలంబాసన్నంబగుచున్న యది నేను పోయివచ్చెద దయయుంచుము.

(అని అందరు నిష్క్రమింతురు)

(రంగము. దర్పణసౌధంబు-కీరవాణి ప్రభృతి చెలికత్తెలు గొల్వ మిత్రవింద కూర్చునియుండును)

మి— కీరవాణి! నాదగ్గఱ జేరికూర్చుండ వెందుకు?

కీ— పలికసానీ నాకంతకంటె నేమిపని యున్నది. వచ్చియుంటిని.

మి— (కీరవాణిఁ జూచి)

ఉ. ఎప్పుడు నా స్వయంవరముకై యేర్పడు భూపతులందరుండ నే
నెప్పుడు నామనోహరునికై యింపారఁగ చూచెద కన్నులారగా

నెవ్వఁడుశౌరికంఠమునకే హేమమయంబగుదండ వేతునా
కెవ్వఁడుచక్రిభర్తయనికే యెల్లరుబల్కుఁడు రింపుమీఱగన్॥

(అనినకీరవాణిదిగ్గునలేచి.)

కీ—తల్లీభవదుల్లంబురంజిల్ల మునితల్లజుండంతయు కరతలామలకంబుగా చెప్పిచనియెకదా. ఇంతలో తొందరెందుకు. ఎల్లయోచింతము. (అనునెడ చతురంగబలయుక్తుండై కందర్పుండుదవ్వుదవ్వులదోచిన బెదరి చెలికత్తెలన్గాంచి బిగ్గరగా)

మి—ఉ. మారుడుసారసాలయమకే మారుడుశంబరదైత్యనాథసం
హారుడుమోహకాననవికే హారుడుపుష్పశరప్రసారణా
చారుడుదుష్ప్రయుక్తపరికే చారుడుయావతమానసాంతకా
కారుడుఘోరవజ్గుణవికే కారుడువచ్చెనుచూడవే చెలీ. 8

చ. చిలుకగుఱంబునెక్కికటికే చెక్కునకేతకిబాకుతళ్తళ
ల్వోలయపరాకుచెల్పుచునుకే వెంటపికంబులుగొల్వఁగోరువం
కలుభటులై చెలంగసుమకే కార్ముకమెక్కిడిపూవుటంపర
గ్గలికిచప్రదేశమొగికే గాడగనే సెనికేమిసేతునే. 9

(అనికొంతసేపూరకుండి.)

ఇంతీయీకంతునికొంతసేపుకొనియాడిచూచెద. (అని)

సీ. కమలబొణుండవైకే కమలపాణులనేచ
నాయమాయిదినీకుకే కాయజన్మ
శుకతురంగుండవైకే శుకవాహులగలంచ
మోదమాయిదినీకుకే మాధవసుత
రతినాయకుండవైకే రతికాముకులనొంచ
బింకమాయిదినీకుకే పీనవక్ష
సుమకార్ముకుండవైకే సుమకోమలులముంచ
తేజమాయిదినీకుకే భూజననుత

గీ. శబ్దసంబంధబాంధవ్యకే సరణిచూడ
భేదమింతైననగనుపించకే లేదుమనకు

యెందుకో చలమిటుచూపు • తెలుఁగరాదు
భూరితరవిక్రమధురీణ • పుష్పబాణ. 10

(అనియనేకవిధంబుల బ్రార్థించిన నంతకంతకు వెతపించుచు పంచవిధశరంబు లొడలనించుచున్న కీరవాణిం జేరంజని దైన్యరసంబుతో)

హిందుస్థాని—జాల్పతాళము.

ఇకెంతసేపునేభరింతునే సఖీమణీ।
యకారణంబుగానలంచె వయొసఖీమణి॥ యి కెం॥
సుమాస్త్రువాళిమేనునించె చూడవే చెలి।
యమానుషంబుసేయఁబూనె నన్నుయో చెలి॥ యి కెం॥
సుమంతయైనధైర్యమెదను సోకదే చెలి।
సుమంబువంటిమేను కాకఁ గ్రుక్కెనే చెలీ॥ యి కెం॥
ధరనొప్పుశ్రీచొల్లేరునగర ధాముఁడై కృప।
వరలక్ష్మినారసింహరాయ వరదుఁడేలనే॥ యి కెం॥

(ఇట్లుబల్కి తనలో) తెల్లికి వేయివిధంబులని పెద్దలనెడిమాటలబద్ధమా యీకొంచెపువానిని మంచిమాటలతో వేఁడిన మేలు సేయునా సేయఁడుగాన వీనిమానంబుదూలి నేలపాలగునట్లు గట్టితిట్టులు తిట్టి యేమట్టువెట్టెద కానిమ్ము. (అని రోషావేశముఖారవిందయై)

మ—శా. నీకోదండము వాడ నీదుశరము • ల్నీరంబులోఁ గూడనీ
బాకాచెట్లను జిక్కనారివెతలై • పద్మంబులందక్కనీ
మూకల్గొండలనుండ నీరదము పా • ములొన్నటిలో నిండనీ
లోకాశంభుఁడు చూడనేనుమదిలో • నుంతైననిన్వేడరా.
ఉ. నీకును నీదుమామకులెల్లనీతియొకింతయునైనలేక పె
న్వాకలపెట్టుచుండెద వకారణ వైరముచే వియోగుల
న్దీకొనలేవు యోగులకెదిండిమగంటిమిగల్గువాడవే
ఛీ! కమలాస్త్ర శంకరునికే చెడెనన్మది సిగ్గులేదుగా. 12

(అని సరోరుహాస్త్రుని తిరస్కరించి తదీయ చతురంగంబుల జూచి కోపముతో)

సీ. కీరమా నీకింత • బీరమా నాపొంత
నరువసాంకవగంధి • నోటవినవె
వాతమా సంజాత • శీతమా ఇదిరోత
యనవు శేషఫణివేణి • ననుచు కనవె
పైకమా నీవింక • ధాకమా సవుజింక
మిడనీలవాలనా • మెరుగవేమొ
భసలమా నీవిట్లు • మొసలమార్గమదెట్లు
హేమనాసనటంచు • నెంచిమనవె.

గీ. యొదిరిబలముల నెరుగక • నెవ్వరేని
కదసిపోట్లాడ పరిభవం • బొదవకున్నె
యందుకేకద మీదారి • హరుని దాకి
భస్మమైపోలదే మున్ను • పంతమేది. 16

(అని శుకపికముల యసమీర జంభరంబుల నదలించి చెలికత్తెల జూచి) సఖీమణులారా! యెన్ని జట్టినా అన్నియు న్మరచి కుసుమాస్త్రుండసమాన విక్రమంబున పుష్పాటంపరచె నోడలెల్ల, చురుకు, చురుక్కుమనుపించె. కలకలమని చిలుక లులికిపడ బలికె నాతతభీతినసువాసితంబులు చీకాకుపడ కోకిలమూకలు కోకోయనికూసె. ఇమ్ముగా తలదిమ్ము గ్రమ్ము తమ్మితేనియ లిమ్ముగాగ్రోలి తుమ్మెదమొత్తమ్ములుఝుమ్ఝుమ్మన గానమ్ములు చేసె. మేనువడంకె. నేనింక సైపజాల (నని నెమ్మేనుమఱచి మూర్ఛిల్లిన చెలికత్తెలు వెల్లనైన మోములతో) తల్లి! మాయుల్లంబులెల్ల ఝల్లుఝల్లన మిక్కుడడించి నీవెక్కత్తె వెక్కడికిపోవుచున్నదాన వికజన్వని మాకెవ్వరుదిక్కు— (అనునెడ కీరవాణి ధాతుస్థానంబుల పరిశీలంబు చూచి)

కీ—మదనమాలా.

మ—ఏమమ్మ కీరవాణీ.

కీ—ఇదిగో దీని చేయి చూడుము.

మ—చూచితిని.

కీ—క. ఇది మూర్ఛగాని వేరొక
విధ మేమియు లేదు చూడ ♦ విధుబింబముఖీ,

మ—క. అదియే నేననుకొంటిని
సుదతీ యేమిడినకనుల ♦ చూచు నెమనలఁగా. 14

కీ—సుందరీ తొందరించిన కార్యంబవునా నేనందుకే కదా యోచించుటలు.

మ—అక్కా నీవన్నియు దెలిసినదానవు, నీవే చక్కనపోయెదవా నాకు నా చక్కియే ముఖ్యము.

సీ. పడతిరో చల్లని ♦ పన్నీరు చిల్కనా?

కీ—యదికను దమ్ములఁ ♦ కంటవలదు.

మ—కమలాక్షిరో చంద్ర ♦ ఖండంబు రాతునా?

కీ—స్తనచక్రములకడ ♦ దలచవలదు.

మ—కలికిరో చిగురుటా ♦ కులగుత్తులిడుదునా?

కీ—తనుధర్మమునకది ♦ తగులవలదు.

మ—వెలదిరో నేమంచి ♦ వీవనవేతునా?

కీ—ప్రాణపుష్టముకడ ♦ పట్టవలదు.

మ—గీ. చారుతరశైత్యచందన ♦ వారికోరి
తెచ్చితిని చల్లవచ్చున ♦ మచ్చకంటి

కీ—మదనతాపంబు చే గ్రాగి ♦ హృదయకలశ
పూరితస్నేహరసమది ♦ పారలవలదు. 15

(అనెడు పలుకులకు మదనమాల మదికుదరక)

మ—కం. ఏపని సేయగఁబోయిన
నాపని వలదందువెప్పు ♦ డదియేమిటికో.

కీ—కం. ఓపడతిరో పమటవే
యాపనులాస్థానములను ♦ నహాణములటవే. 16

మ—అక్కా కీరవాణీ! ఈచక్కెరబొమ్మ వాల్చినపక్క కదల్చకున్నది. కాలాతీతంబైన నేమి హాని సంక్రమించునో గాన త్వరగా శైత్యోపచారంబు లొనర్చుటయే మంచిది. (అనికీరవాణిఁజూచి)

సీ. ఇంతియీచిగురాకు♦ లేమి సేయుదమమ్మ?

కీ—తీవిపాదములకం♦టించవమ్మ.

మ—అరటులపొరలున్న♦వవియేమిపనికమ్మ?

కీ—పొలతియూరువులకు♦ పొదువవమ్మ.

మ—తామరాయులరుగు♦త్తులనెందుకోకొమ్మ?

కీ—చెలిగుబ్బచనులపై♦ చేర్చవమ్మ.

మ—కలువరేకులుచాల♦ చెలులు దెచ్చిరిసుమ్మ?

కీ—కలికిన్నులమీఁద♦ కప్పవమ్మ.

మ—గీ. మొలకజాల మిదెందుకో♦ తెలియదమ్మ?

కీ—ముగుదకుంతలములనుండి♦ ముడువవమ్మ.

మ—చెలఁగికొండమ్ము లేపని♦ సేయునమ్మ?

కీ—గోతిచేదోయికిని గీలుకొల్పవమ్మ. 17

మదనమాలా! చూచితివా యీవస్తువు లీస్థలంబులకనుకూలంబులై శైత్యోపచారంబులచే నొక్కయరక్షణంబునను తెలివి నొంది ప్రకాశింపఁగలదు. చూచుచుండుఁడీ. (అనునంతలో ముసుంగిడిన పట్టుశాలువసడల్చి దిగ్గునలేచి, కీరవాణీ మదనమాలలంజూచి)

మి—తోఁబుట్టువులారా! మీ మోముదమ్ము లెందుకో చిన్నవోయియున్నవి చెప్పుఁడు. (అనినవారలు చెక్కిళ్ళు దువ్వుకొని చెక్కులు ముద్దుపెట్టుకొని గంభీరభాషణంబులతో)

చె—గీ. ఏమిచెప్పుదుమమ్మ నీ♦వివుడుమూర్ఛ
నొందినందున భయమంది♦ చేయువిధము
లెల్లచేసిన తెలివొంది♦ తివుడుమధుర
మృదులవాగ్విభ్రమందధ్రుతకుంద♦ మిత్రవింద. 18

(అనిన వచ్చియురాని నవ్వునవ్వి పునఃప్రహావేశం బగుటయు చెలికత్తెలఁ గనుంగొని)

తోడిరాగము—ఆదితాళము.

మి—రాజేమాయుల కాడే-యీడుజోడని నమ్మియుంటిని
నన్ను వీడనివాడనుకొంటిని। యేడే వాడయి రాచవాడి మాని
యెందు॥ రాజే॥
ఘనుడౌతడవి వలకోటగా। యల్ల। మునిమాటలవినీళ్ళమాటగా।
మది। నసుకున్న ముచ్చటలవి దూరమైపోయె॥ రాజే॥
మారుడెక్కువశత్రువుడాయెను। కంటికిరేతిరిదారుక్కు లేదాయెను
కీరవాణియింకయేరీతిభరియింతు రా॥
వరకీర్తిరజితహీరకాశుడై చొల్లే। ఉర్విదివ్యసౌధనివేశుడై
ధరతాడేపలిలక్ష్మీనరసింహారాయేడ్యుడు రా॥

(ఇవ్విధంబున నలంగుచున్న యామంగళాంగింగని తేనెలొలుకు పలుకులతో.)

చె—కం. కొమ్మా నామనవిని గై
కొమ్మా నీవింత మరులుకొనతగదమ్మా
రమ్మా వనరాజివినిక
రమ్మా రయ సుగుణసదన రాజితవదనా. 19

చం. అచటికిపోయిచూడదగినట్టివినన్నియు జూపనచ్చట
న్విచికలపుష్పసంపదలవేడుకలెల్లనుగన్నెమ్మది
న్రుచిగనుపించుపిమ్మటసరోరుహలోచనయిల్లుజేరిన
న్పచురతనన్ని కార్యములభంగురరీతిజెలంగుతప్పకన్॥ 20

(అనిన సంతోషమొందక డోలాయమానస్వాన్తయై)

మి- క. మాటలాకతోటి చెప్పిన
హాటకచేలుండువచ్చిమాసుదలిర్ప
న్గాటములదేల్చకుండిన
బోటిరొసంతోషమెట్లువుట్టును చెమా. 21

అయిననుమీఇష్టానుసారంబువచ్చెదనదియు తీరును. నారదునిమాటలకన్నసీతోటయెక్కువయే! మీకుకోపంబురానేల లెండు. (అని అందరు పరిక్రమింతురు.)

(రంగము. శృంగారవనంబు.)

మిత్రవింద చెలికత్తెలతోఁబ్రవేశించి యచ్చటివింతలు కన్నులకొలఁదిఁజూచుచు చెలులంగనుంగొని)

ఫీలురాగము-ఏకతాళము.

వనమెంతో శృంగారమే బాలా।
వినమిట్టిదని గట్టిగను నెవ్వారనరైరిమున్ను॥ వన।
అలమల్లెపువ్వుగలతావు-లిలమించెగలిగించె!
వలనొప్పబలుకూరిమెదవు॥ వన॥
చామంతివిరులేమొపాలుఁపొంది-నామీఁదనామోద।
మీమాడ్కిఁబ్రేమంబుజూపె॥ వన॥
ధరచాల్లేరుపురముననుండి-వరతాడేపలి లక్ష్మి।
నరసింహరాయేద్యుఁడేలు॥ వన॥

సీ. తనముక్కురంగుసంధ్యానబూనెననికదా
చిలుకదాడిమపండ్లుఁ చించుచెల్ల
తనవల్పుసీడయుం దునిచెనేడనికదా
యామ్రమంబుననుపికం బఱచుచెల్ల
తమకుంభములదాకఁ దలచినవనికదా
వెలగపండ్లకుకరు ల్వేచుచెల్ల
తనకైత్యమొగిగర్భ ముననదాల్చెననికదా
వలిగాడువరటుల గలచుచెల్ల.

గీ. తమతనుప్రభలొగితరంగములనుంచె
ననిగదావానిహరియించ హంసలెల్ల
నీకొలంకులలోనుండు నెల్లచూడ
చిత్రమయ్యెనువూదోట చెల్వమెల్ల.

(అని కీరవాణి కై దండకొని)

ఆహా! మంగళాంగి మనకుఅంగట వెలుంగు సరోవరస్థిత మంజుతర కంజాతపుంజ సంజాత, మకరంద, బిందు సందోహపాన మద బంభర డింభ శుంభ త్సంగీత మాధురీ శ్రవణాసక్త చిత్త సమాగతైణ కిశోరంబులును తద్వైణకిశోర విశాల చంచలదృగంచల సంభూత హాశ్చర్య రసమహార్ణవ తరంగిత రంగిత కరుణాప్లవస్థిత వనదేవతా వితానంబును, తద్వనదేవతా కనత్కనక కుంభ సదృశ మాంసల స్తనయుగ్మలావణ్య వీక్షణమాత్ర వ్రీడీకృత కరిణీనికరంబును, తత్కరిణీనికర సముద్యత్కర కంపితరసాల రసారుహంబుబులును, తద్రసాలరసారుహ పతితమహా రుచికరఫలవితానభుజ్యమానసంతోషిత వనసంచార శబరవనితా సందోహంబై వెలుంగు నీయారామంబు నందనంబును గేలిసేయుటకు సందియంబే సంతోషించితి. (అనిన కీరవాణి సంతోషంబున)

కీ—కం. మెచ్చితివీవనరాజం
బచ్చుగదోహదముసల్ప♦వైతివికొమ్మా
మి—కం. మచ్చికతోనదిదెల్పిన
మెచ్చుచుసల్పెదనుమనకు♦మేలుగదమ్మా. 28

(అనిన ప్రతివృక్షంబును జూపించుచు)

కీ—సీ. ఇదియశోకముదీని♦పదతాడనముసేయ
మిదివకుళంబుమే♦లొదవనుమియ
మిదికురువకమునీ♦వెనసికౌఁగిలిగొను
మిదితిలకంబిందు♦వదనచూడు
మిదియెమాకందమి♦య్యెడకరంబుననముట్టు
మిదికర్ణికారమిం♦పెనయఁజేయు
మిదియెవావిల ముఖా♦హీనవాయువుఁగప్పు
మిదియె నమేరు మో♦మెత్తినవ్వు

గీ. ఇదియొ సంపెంగ ముకుళరాగ - మెలమి నీదు
మిదె ప్రియాళువు సంగీత ♦ మిచ్చెఁ బాడు
మీవిధంబునఁ బుష్పించు ♦ నీకుజంబు
లట్లుగాకున్నఁ బుష్పించ ♦ వదినిజంబు. 24

(అనివలుకు చెలివలుకులకు మొలకనవ్వు లొలుక)

ప—కస్తూరిగంధి! నీచెప్పినచొప్పున చేసితివి. నీ వన్నమాట లన్నియు వన్నెపెట్టినట్లు జరుగుచున్నయవి నా వెంట నంటిరమ్మా. నెచ్చెలీ! యిప్పుడు విచ్చులవిడిపూసిన పచ్చపువ్వుల గోరంట దంట కొల్లగా నల్లుకొని తరణి కిరణంబుల జొరనీక చల్లగాడ్పుల కిరవై యుల్లసిల్లు యీమల్లెపొదలలో నుల్లంబులు రంజిల్ల సల్లాపంబు లాడుచు కంటికింపైన నీటుకాండ్రతో బోటులు వాటంబుగా కూటంబులో నర్పుట కాహా యెంతవీలుగా నున్నదో కన్నులారజూచితివా? యిది యట్లుండనిమ్ము. మనకుఅంగటజెలంగు సంపెంగలసొంపు కంటికింపుగాకంటివా ఘుమఘుమను వాసనలెల్లదిక్కుల నల్లుకొని బంగరు రంగును తురంగలించగల సోయగంబుచే నివ్వాటి పూ పువ్వులు కొల్లగా శోభిల్లుచున్నయవి. ఇట్టి పసగల కుసుమంబుల దంట కొక్కతుమ్మెదయైన మతిమఱచియైనం జేరదు కదా. నిండుజవ్వనంబున గండుమీలు నాయండకా పుండరీకాక్షుండరుదెంచని చందం బిందు గన్పించుచున్నయది. అక్కా నా కొక్కరుతో వైరికదా. ఇదిపోనిమ్ము. ఈపన్నీరుకాలువదాటిపోదమురమ్మా. తొయ్యలీ! యీతియ్యమామిడిచెట్టుకొమ్మలసందున పసందుగానుండిమెండుగాపండిన పండులను తనచంచుపుటంబుతో చించిరసవిసరంబు పసమీఱ ద్రావి తనచెంతనున్న కాంతకందించుచున్న యీశుకరాజంబును చక్కగాజూచితివే! యేమిహాశ్చర్యము! యెక్కడచూచినా స్త్రీపురుషుల కన్యోన్యదాంపత్యంబు లే కన్పించుచున్నయవి యిదిచాలించుము. చల్లని నీరంబులు వెల్లువలై పారుచున్న నాసరసిచెంత నొక్కవింతగన్పించుచున్నయది. చె

చ్చెరవోదమురమ్ము. చూడు-చూడు. చేమంతి పూబంతులు రెండుచేతికిచ్చి హెచ్చిన మచ్చికతో నొక్కచెంచుకోడెకాడొక్క చక్కెరబొమ్మనుగట్టిగా బట్టుకొని నీచెక్కుటద్దంబులొక్కసారి నొక్కినిమ్మని మ్రొక్కిన నాటక్కులాడి గిరక్కున మరలిపోవుచున్నయది. అది రతిపరిశ్రమ మెఱుగనికన్నియవలె దోచుచున్నయది. కాకపోయిన యాకలికికంటికింపుగన్పింపకున్న వాడేమో? లేక మననిద్దరిని చూచినయీముద్దియ సిగ్గుచేపోవుచున్నదియో. బోటీమనకేమైన పాపంబు ప్రాపించునా (అనినకీరవాణినవ్వుకొనుచు)

కీర—బాలా! నీవెంత బేలవే యీవాలుగంటినేమైన మనమొద్దనిగద్దరించితిమా యేమి. నీపిచ్చిముచ్చటలిక చాలించుము (అనిపశ్చిమదిక్కుమొగంబై)

మి—కలకంఠకంఠీ! మనము నేక మధురరసభరితంబులగు ఫలంబు లనుభవించితిమి. సుధామధురంబైన చల్లనినీరంబులు గ్రోలితిమి. ఈయారామంబునన్గలచిత్రంబులెల్ల కన్నులకింపుగా చూచితిమిక కొంతసేపు ఒక్క బాలరసాలభూజంబుక్రింద నెలరాలితిన్నెయందు కూరుచుని పరిశ్రాంతిజెందుదమా తల్లీ. (అందరుపరిక్రమింతురు.)

(రంగము-వనములోనున్నమేడ. సఖీపరివృతయైనమిత్రవింద ప్రవేశించుచున్నది.)

మి—మదనమాలా! కాంచితివా.

సీ. భానుడలుదెంచునని పేరిమకమూనివేడ్క
పశ్చిమాశాసతీమణికపరగనెఱ్ఱ
పట్టుచీరెనుదాల్చినకపగిదిచూడ
సంజకెంజాయదోచెనుకఛాయగలిని.                              25

గీ. ఆచీరపనికిరాదని
దాచివేసన్నల్పుకోకకదాల్చినగతిమా
డాచానకటికిచీకటు
లీచతురాశలమెలంగెకహెచ్చుగపైపై.                              26

క: నిక్కముగ గగనచారులు
చక్కగదీపంబులిడినచందంబున నే
డక్కాఁచూడవెమింటను
జుక్కలుకన్పట్టెచూడచూడఁగనింపై.

చంద్రోదయవర్ణన.

సీ. హరికిమ్రొక్కెడిశచీతరుణివెల్గించిన
దీపించుకర్పూరదీపమో
పూనిజయంతుడొప్పుగభార్యవెసచూడ
మొనసిచూపించెడిముకురమో
తమ్ముడుచూడకందర్పుడొయ్యనగట్టి
వంపినముత్యాలబంతియో
యమరులు తమజయంబమరఁదెల్పఁగవేడ్కఁ
గట్టించినట్టి జేగంటయో
గీ. సౌరవల్లభకంఠస్థహారమందు
బరగుచున్నట్టివజ్రాలపతకమో
పైజయంతమునందు దుర్వారగతిని
నలరుగోమేధికపు గడియారమో.
(అని కొంతసేపు వితర్కించి గట్టిగా)
సీ. కర్పూరదీపంబుగాదీవెలుంగుపై
వెలయజక్కవకవవిప్పఁజొచ్చె
వరపుగాముత్యాలబంతిగాదీప్రభ
పొడగన్నవెన్నెలపులుగులెచ్చె
ఖచరులమేటిజేగంటగాదీకాంతి
చూచినపద్మములొ్నంపువిచ్చె
శక్రదర్పణఫలకంబుగాదీరుచి
గాంచినకల్వలగములుమెచ్చె.

గీ. సన్నసన్నని వెన్నెల లల్లాగనమ్మ
చూడచూడగ వలిగాడ్పు సోకెనమ్మ
మగువ చుక్కలు పైపైన మాసెనమ్మ
పేర్మిగనవమ్మ యిది చంద్ర బింబమమ్మ.                                 29

(అనితచ్చంద్రాగమంబున కానందభరితాంతఃకరణయై కొంతసేపూరకుండి)

ఓమదనమాలా! ఓకీరవాణీ! గండుమీరెడి యీపండువెన్నెల జగదండంబు నిండికొని కాంతిమంతంబై యున్నదను సంతోషంబు నామంతనంబున కింతయైన లేదుగదా! మీకందరి కెట్లు లున్నదియో యెండకాలంబున పండువిప్పల దండగూరుచుండ నెట్లుండునో యీ చంద్రుని చంద్రికా హారంబు నామేనికంత యుష్ణంబు చేయు చున్నయది. నాకీబాధసోకకుండ నీకల్వల తేడును వేడుకొనుచున్నదాన. (అని ప్రకాశముగా)

క. చల్లని రేడవు నీదగు
చెల్లెలు కల్కులనొసంగు క్షితినందరికి
న్నొల్లగనీ బావయు వెను
ఖల్లిదుడు భవద్గురుండు పాల్కడలిగదే.                                 30

ఇట్టినీవు నాయట్టిపట్టిని రట్టుపెట్టనాయమా (అని వేడుకొని యనంతకంతకును కిరణప్రసారణం బెక్కుడైన తీవ్రకోపానలంబు దరికొల్పుచు,) శీతకరణా! యిక నీగర్వభంగం బగునట్లుగట్టి తిట్టుల తిట్టెద చూడరా (అని బిగ్గరగా)

సీ. పగలెల్లదాగిదొం గగతి తేదిరుగాడు
ముచ్చనీ యెదపైన మచ్చపుట్టె
సొంపుగామిత్రుని చూడలేకనలంగు
దైన్యాత్మ నీకళల్ దరగిపోను
చదువుచెప్పినవాని ముదితను చేకొన్న
పాపిలేనట్టినిక న్నాముబట్టె

మొదటిచెల్లెలితావుఁముకుళింపచేసిన
ఖలనీకుపాండురోగంబుపుట్టి

గీ. పుట్టినింటినిబొంగించిపొరలసేయు
కష్టజాతివిసీజగికికాఱుచుండ
వెసవియోగులపై బండఁవేయుచుండ
కందదాయనునీకండకచందురుండ. 31

క. తరుణులబాధింతురయో
పురుషులకై సిగ్గులేకపొల్పుగనీవా
మారుడాయుష్మంతులరై
హారిహారిపావులకునాయుఁవధికముగాదే.

ఉ. మునుపలదక్షుయాగమునఁముఖ్యాతదక్షునిపక్షమైమదం 32
బునవడివీరభద్రునితోఁబోరినవనిన్నాగివామపాదను
ట్టినసలయించెనప్పుడుతఁటాలునబారితివారమాద్రుశాం
గనలగలంచకోరిచెడుఁగాయిదిబంటుతనంబెరాజుకా. 33

(అనియనేక విధంబుల దూరిచెలులగనుంగొని) ఇక్కరాతుం
డుక్కుమిగిలి లిట్టినమొండివడి పందువెన్నెలల నలయింపుచున్నవాడి
క నేనోర్వజాల. (అని మూర్ఛమునింగిన కీరవాణిమదనమాలంజూచి.)

కీ—క. వనజాస్త్రినిబారికిజ
వ్వనిగుందినగాదెమనమ్ముఁవనముకురాక
ల్వనజాక్షినిచటవటువలె
వనజారినలంచసాగ్వనమేలయికకా. 34

(అనినమదనమాలయోచించి)

మ—అక్కా ఈచక్కెరబొమ్మను శీతోపచారంబుల న్మూర్ఛదేర్చి
యింటికిచేర్చి యీమచ్చటలా మచ్చెకంటితల్లికి నన్నలకు నెఱ్చి
శీఘ్రకాలంబులో స్వయంవరంబు జరుగునట్లు సేయుట యుచిత
మైనట్లు నాకు తోచుచున్నయది. నీచిత్తం బెట్లున్నదో యోచిం

చుము. లేనిచో నీతోయుజానన కాయజ తోయజారుల బారులచే డస్సినపిదప మనమేమి సేయఁగలవారము. (అనిన)

వీర——మదనమాలా ! నీయోచనయోచించతగినదే.

(అనిమూర్ఛదేర్చి, అందరు నిష్క్రమింతురు.)

తృతీయాంకము సంపూర్ణము.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

---

## చతుర్థాంకము

(రంగము-విందుఁడు-అనువిందుఁడు-మంత్రి.)

---



నర్మసచివ! ఇటురమ్ము.

మం—రాజకుమారా! వచ్చియున్నవాఁడ సెలవేమి,

విం—క. మామిత్రవిందకాశ్రిత
రామకువరుసస్వయంవరము సేయుమటం
చాముని పతి సెప్పినపున
మేమి యొనర్పకనునుంటి మిందాక నొగిన్.

కావున మంచిముహూర్తంబు విచారించి చెప్పుటకు మనపురోహితశిఖామణియైన గర్గమహాముని నాహ్వానింపుమా.

మం—చిత్తము లాగే పిలిపించుచున్నవాఁడ, (అంత గర్గుండరుదెంచి ద్వారపాలకుఁజూచి)

గర్గ—ఒరే! నీవెవ్వండవు? నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా?

(అనిన వాఁడు లోపలికిపోయి)

ద్వా—ఓరి! నీవెవ్వఁడవు? నేను వచ్చియున్నానని మీరాజుగారితో చెప్పుమురా? (అనినరాజునవ్వుచు)

విం—ఛీ! ఛీ! పిచ్చివిధవా! వచ్చియు రానిమాటలు మాట్లాడకుపో (అంతవాఁడరుదెంచి గర్గునిజూచి.)

ద్వా—ఛీ! ఛీ! పిచ్చివిధవా! వచ్చిరాని మాటలు మాట్లాడకు పో. అని అన్నాడయ్యా స్వామి!

(అనిన వానిజూచి)

గ—అష్టాగాదురా శంతా! ఆయన వచ్చియున్నాడని అనరా.

[అనిన ద్వారపాలకుడిట్లనగా రాజు కోపోద్దీపితమానసుండై.]

విం—ఛా! దుష్టమానసా! చెంపలువేయించెదవెళ్ళిపో. మళ్ళావచ్చితి వేని నీమచ్చమాపెద (అనిన వాడువచ్చి అదియేఅనును)

గ—ఈమాటువెళ్లి మీపురోహితుండగు గర్గుండు వచ్చినాడనిచెప్పుమురా (అనినచని వాడట్లుచెప్పును)

విం—శీఘ్రముగారమ్మనుమని చెప్పుమురా (ప్రవేశించును)

విప్రవర్యా పదివేలవందనంబులు కల్యాణు, కల్యాణు. ఈమణిసింహాసనమందధిష్టించుడి (కూర్చుండిపిమ్మట)

గ—రాజన్యశేఖరా! మీరునన్ను రావించిన కారణంబేమో సెలవివ్వుడు (అనినహాసన్ముఖుండై)

విం—గీ. పొందుమీరగమామిత్రకేవిందకిపుడు
పరిణయమొనర్పగనుస్వయంకేవరముసేయు
బూనినారముశుభకరంకైనయొక్క
లగ్నమునుచూచిచెప్పుమీకేలలితచరిత. 2

(అనినసాబ్రాహ్మణుండు హాస్యరసంబు చూపించదలంచి)

గ—రాజా మేముక్రొత్తగా గుద్దలించిన పంచాంగశ్రవణ శ్లోకంబుసావధాన చిత్తుడవై వినుము, (అని పంచాంగము చేతపుచ్చుకొని బిగ్గరగా)

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం రిపుహతం దుస్వప్న దోషాధికం।
గంగాస్నానవిశేష పుణ్యహననం గోదానభంగం నృణాం।
ఆయుర్భంగమముత్తమం సుచిహతం సంతాన సంపర్ధరం।
నానాదుష్కృతసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం॥

అద్యరాత్రి తిథిప్రమాణత రంగసాని... ......గడబడ నామ సంవత్సర దారితలమాసంబున నింద్రియపక్షంబున నేడు ద్వాద శాంగుళ ...... వారం కంఠాభరణ నక్షత్రం దుర్మదయోగం బాలకరణం. ఈరోజున పన్నెండుగడియలరాత్రికి ... ... ... ... ఛార్జం తెల్లగా వెళ్ళిపోచుంది మహాప్రభో ! (అనిన రాజు ముసిముసి నగవులునగవుచు)

విం—గురుశిఖామణీ! మీరిక హాస్యరసంబుమాని శాంతరసంబుగైకొని మేమడిగిన ప్రశ్నకుత్తరంబొసంగవలయును. మహాత్మా! (అనిన సంతోషి తస్వాంతుండై)

గర్గు—అట్లాగే చెప్పుచున్నాను. రాజేంద్ర!

గీ. సరవి రేవటిమాఘమాసంబునందు
శుక్లపక్షంబునను మదిసొంపుమీర
దశమిగురువారమునమహాదాత్తగతిని
నొక్కలగ్నంబుసఫలమైయున్నదయ్య. 3

ఈలగ్నంబున మీరాకార్యం బొనర్చితిరేని చక్కగా నిర్వర్తిల్లు. రాజచంద్ర! (అనిన సంతోషించి మంత్రిమొగంబుచూచి.)

విం—నర్మసచివా! యీధరాసుర శిఖామణికి అనర్ఘ్యవస్త్ర భూషణతాంబూలాదికంబు లిప్పించి వీడ్కొల్పుము. అంగ వంగ కళింగ కాశ్మీర కురు కరూశ ద్రవిడాంధ్రదేశ ప్రముఖ చప్పన్న దేశాధినాథులకు ఈవార్త శుభలేఖలమూలముగా తెలియపరుచుము. లగ్నకాలంబు వరకేవిధమయిన లోపములు లేకుండునట్లు అన్ని కార్యంబులొనర్పుము. మన నగరంబుశృంగారింపఁ బనివాండ్రనియమించుము.

మం—భవదాజ్ఞానుసారంబుగా భూసురోత్తమున కన్నివిధంబుల సంతోషపెట్టి పంపినాడ. తక్కినవన్నియు క్రమక్రమంబుగా సిద్ధపరుచుచున్నవాడ.

(అందరు నిష్క్రమింతురు.)

రంగము—భర్మ్య హర్మ్యము.
(మిత్రవింద ససఖియై ప్రవేశించి, చిత్తబాయత్త
చిత్తయై తత్తరంబున.)

14 జంఝూటి-రూపకము.

మరచిపోతివా కృష్ణా-కృష్ణా కృష్ణా నన్ను
కలువుదీరనీదు సోయగంబుగాంచనైతివా।
నెరకౌగిటనుండితివను-బిరుసున నే మోసపోతి మ॥
ఇచ్చకములు చేసినా-కేమో యేమో యేమో చెప్పి।
పిచ్చిదానిచేసికూరి-మెచ్చజేసితావహా।
మచ్చికచేపయ్యెదముడి-విచ్చినవలమూచ్చటలు మ॥
పెదవితేనియలాని-యానియాని మెచ్చి।
సదమలాంగినిన్ను బాయ-జాలనంటివాహా మ॥
ముదమొదవగకందర్పుని-కదనంబున నేలపదది।
ధరణిచోల్లేరుపాల-పాలవాలశౌరి।
కరుణతాడేపల్లిలక్ష్మీ-నరసింహరాయావన।
శరణంటినిసరసిజముల-నిరసించెడిచరణములకు మ॥

(అను వాక్యంబులు విని వెరగంది కీరవాణి మదనమాలలులేచి చెలి—తల్లీ! రాజపుత్రీ! నీకొదవినమదనజ్వరంబును చంద్రశైత్యంబును పోగొట్టి యుంటిమే. తిరిగి కృష్ణపై త్యోద్రేకంబు గలిగినట్లు తోచుచున్నయది. ఏమికారణంబు చెప్పు మొప్పులకుప్పా అనిన తలయెత్తి చూచి మహాదైన్యంబున)

మి—ఉ. ఏమనిచెప్పుదాన తరళేక్షణలార! మదీయమానసం
బామురవైరియందుప్రియమీమారగడించెనుమేనుమాత్రమి
చ్చోమిముబాయకున్నయది-సొంపుగనేనుగమింపఁగువెల్లపం
డైమనియున్నదంచునెద-లందులనమ్మకుడమ్మమీరికన్. 4

(ఆత్మగతంబున)

15 నాటకురంజిరాగం-రూపకం

మరచినామరపురావుగా—పగకానివగలు॥
కరువుదీర మోవిపాన-కంబుగ్రోలిచవులకలరి।
చెరుకురసంబాకలెక్క—యే—చెలియనిపలికినపలుకులు మరు॥
నడుముక్రిందయెడమచెయ్యి-నాణెముగనుజొనిపియెత్తి
యెుడలెల్లనునొడలిపయిన్యడ-కౌగిలిగొనుదుడుకులు మరు॥
కప్పురంపువిడెముపంట-గట్టిగానుబట్టినన్ను
చప్పునమునివంటనుగొను-మిప్పుడనెడుపలుకులన్ని మరు॥
లలితలిర్సతాడేపల్లిలక్ష్మి-నారసింహరాయు
నలరించెకుచొల్లేర్చర-చలజాక్షునిబలునేర్పులు మరు॥
(అనికీరవాణిమదనమాలలగనుంగొని)
సీ. రాదుగానాయీడుకవాడుగాదయవీడి
నాడుగానాయమేకచూడవమ్మ
(అనినమదనమాలయంజలిపట్టి)
మ—ఎందుకేచెలివానికపొందుకేగదదీని
మందుకేయోచించుకచుందునమ్మ
మి—పోదుగావిడనాడకరాదుగాయీకూర్మి
లేదుగాప్రియమునాకమీదకొమ్మ
(అంతకీరవాణి తేనెలొలుకుపలుకులతో)
కీ—కందకేమడిభీతికజెందకేమరుబారి
గుందకేధైర్యంబుకజెందవమ్మ
మి—గీ. మానవచ్చునెయనుభవకమైనకతల
మ—మానుటొకయుభమేవెట్టికదానవమ్మ
మి—పోయివచ్చెడివారెవ్వకరేయుచటికి
కీ—పంపవేపోయివచ్చెదకపైడిబొమ్మ. 5

చికురనిందితషట్పదబృంద! మిత్రవింద! నీడెందంబున నెందు
కు సందియంబు. నీయిష్టంబుకష్టంబనకస్పష్టంబుగా చేసెద. చెప్పుదగి

నమాటలు చెప్పిన నిప్పుడే పోయెద. నామాట ముమ్మాటికి నమ్ము.

(అనిన చిలునవ్వునవ్వుచు కీరవాణింజూచి)

మి—సీ. కనుమూసిననుచూచి ననుసీదుసోయగం
బున్నతగతితోఁ జుచున్నదనుమి
తనుమానిననుకాని పనిబూని పెరవాని
కోమలికలనైన గోరదనుమి
తనయన్నలనుమన్న ననుగోరితనవూన్కి
తెలియగానూచన తెలిపెననుమి
సిరిపట్టిపర వెట్టి నరుచిర బాణము
శ్వేయుగాచెలినిల్పి దాయెననుమి
గీ. యలుకలొలుకగకలకల బలుకుచున్న
చిలుకపలుకులకలకల కులికెననుమి
ఝుమ్ముఝుమ్మనుభసలగా నమ్మువకును
కొమ్మకిమ్ముగతలద్రిమ్మ గ్రమ్మెననుమి. 6

ఉ. రమ్మనుపువ్వుబోణికిక రమ్మనురాగముకల్గనీపయి
నైమ్మనురుక్మిణీసతివలె న్ననుపందగుమాశుభాంగిని
సొమ్మనుకొమ్మగాదొకరిసొమ్మనువేడుకతోడనీవ్వగా
కొమ్మనుపైడిబొమ్మయనుకొమ్మనుకృష్ణునితోడనెచ్చెలీ. 7
చ. దరమనుమాశుభాంగికిముదంబలరించెడికందరంబునుం
దరమనుమాపసిండికినితళ్కులొసంగెడిమేనిఠవికా
వరమనుమాచనుంగవకువారిజలోచనరేపెనాస్వయం
వరమనుమాజనార్దనునివాసిగతోడ్కొనివేగరానుమా. 8

(అనిచెప్పి నిరుపమాలంకార సర్వావయవయై తనశృంగారం బంత యొక్కదర్పణపటంబునం దాకర్షింపచేయించి యది కీరవాణి కరంబునకు కరంబుగానొసంగి ప్రకాశముగా.)

16 శ్రీరాగం-రూపకం.

పోయిరావె బాలికామణీ। వారికదకునేడు॥ పో॥
నాయుదంతమంత జెప్పి తోయజాక్షుని మొదకును బాయక తే॥ పో॥
నిన్ను నమ్మియున్నదానను। నామనమునందునీ॥ ని॥
కన్నెపాయ మెల్లసొగసుగా నొనర్చి। వెన్నునకేజన్నెకడితి॥ పో॥
ఒంటిగాంచిమాటలాడవే। గోపాలుతోడ నొంటి॥
కొంటెతైనయచటివాలుగంటులకట। వింటేబల్తుంటాయిక॥ పో॥
ధారుణిచోళ్లేరుపురమున। విహారించుచుండి॥
నారితాడేపల్లి లక్ష్మీనారసింహారాయావనుడేలును నిను॥ పోయి॥

కేశాశితజితనీరద శ్రేణీ! కీరవాణి! నాసంగతినీ వెఱింగిన దేకదా! మొట్టమొదట పటంబుముందటబెట్టి కనిపెట్టి మాటలాడుము. స్వయంవరంబునకుదప్పక రమ్మనుము. రానట్టయితే నీరాచపట్టి సిరిపట్టి బెట్టేయునలరంప కట్టియలుగుట్టుచెడగొట్టు. మట్టుమీఱినవగల సెగల న్బొగలి నగుబాటుజెందునని ముకుందునితో చెప్పి యొప్పించుకొనిరమ్ము. వచ్చుచో యావట ఫలాధరుని పటంబు దెమ్ము. శుభమ్మన బొమ్ము (అనిరెండుమూడడుగుల కొలంది సాగనంపును.)

(అందరునిష్క్రమింతురు.)

రంగము—ద్వారకాపురంబు శ్రీకృష్ణకొల్వు.

కృ——(కోరమీసంబులు వడవేయుచు) ఆపదుద్ధరొన్నత్య! యుద్ధవామాత్య!

మం——చిత్తము నందితసనక సనందన నందనందన!

17 జంఝూటిరాగం——రూపకం.

కృ——మంత్రిసత్తమా! తెలియంగబల్కు—। మంత్రి॥
తంత్రములనుసేయుచుభువి దానవులుజెలంగవారి।
మంత్రంబులువినిశితశర మంత్రంబులగూల్చెదవడి॥ మంత్రి॥

మం—నందనందనా చేసెదనుమనవి। నం॥
ఇందిరేశదనుజుడొక్క_డేని-యిద్ధరాస్థలంబు।
నందునగాన్పించరుయే-సందునడాగిరొ తెలియదు॥ నం॥

కృ—భటులువచ్చిరే మనిమంపినట్టి॥ భటు॥
దిటవుమీరగానునరుడు-నిటలనేత్రుగూర్చితపము।
పటుగతితోనొనరించియు-పాశుపతాస్త్రముగొనెనట॥ మంత్రి॥

మం—నిజము దేవరా మీఅన్నవార్త॥ నిజ॥
విజయుపూన్కి దీరను స్నె-విస్ఫురత్కృపాఫలంబు
భుజియించిన కరుణించక-పోనే శంకరుడైనను॥ నం॥

కృష్ణ—పౌరులెల్లను సుఖమున్నవారే॥ పౌ॥
పౌరులెవ్వరైన దుష్ట-బాధజెంది యుందరుగద
కారుణ్యామనంబుల మన-వారలు వర్తింతురుగద॥ మంత్రి॥

మం—ధరణిచోల్లేరు పురపాలుడగుచు॥ ధర॥
వరుసతాడేపల్లి లక్ష్మీ-నరసింహ రాయాగ్రగణ్యు
సిరులొసగుచు రక్షించెడి-ధరణీజపుని బోలినశ్రీ॥ నంద॥

సీ. పాపిపూతనముస్నె • పాణములవ్వడిపోయె
మదతృణావర్తుండు • మాయమాయె
శకటాసురుండు భా • స్వద్రీతినిద్రించె
కడు బౌవుకొంగర • క్కసుడుగాంచె
కంసభూపతితమ • గమునుండిపడిచచ్చె
చాణూరుడాయమ • స్థలముసొచ్చె
యవనుండు మదమున • దవిలినేలకుగూలె
క్షితిజరాసంధుండు • వెతలదూలె.

గీ. దుష్టసంఘముభవదీయ • ముష్టిహతుల
ద్రెళ్ళిపోయినకతమున • దేవమధ్య
రాష్ట్రజనులెల్లహాయిగా • రాత్రిబగలు
సౌఖ్యములదేలుచున్నారు • చక్రధరణ.

నిర్వక్రపరాక్రమ నిర్దళిత దుష్టరాజచక్రుండవై ప్రకాశించుభవద్రక్షణీయంబగుచున్న రాష్ట్రింబెల్లనుల్లసిత సర్వసౌఖ్యలీనంబై యున్నయది. శౌర్యౌదార్య ధైర్యగాంభీర్య ధుర్యుండవగు నిన్నింతవాడవని స్తోత్రంబుసేయుటకు పాత్రుండనే భక్తపక్షపంకజాక్ష!

(అనిన సంతోషిత స్వాంతుండై కోరమీసంబులు వడవేయుచు)

కృష్ణ—ప్రస్తుతకరణీయంబులగు కార్యంబు లెవ్వియు లేవుగదా.

మం—చిత్తము. విచారించిచూచిననేమియుకనుపించియుండలేదు.

కృ—చం. కుడితొడచేయి లోచనముకొకుంఠితరీతి చలించుచున్నది
డ్యెడనెదలోన వేడుకలుకొహెచ్చగజొచ్చెను రుక్మిణిన్మురదం
బడరగబెండ్లియాడుతరికొనైనగతిన్గనుపించెనాకునే
ర్పడవివరించునీమదిలొరంబుగయోచనచేసిమిత్రుడా. 10

మ—సంరక్షిత కృష్ణా! శ్రీకృష్ణా! భవదమృత మధురవాక్యంబులీ సేవకునకు కర్ణానందంబులు చేయుచున్నవి. కొద్దికాలంబులో నొకముద్దియు నీముద్దరాలగు నట్టుకను వట్టుచున్నయది. ఇందు కెందును సందియము లేదు. దక్షిణనాయకుండవై ప్రకాశించు నీకెందరుసుందరులైనం గొదువగానే యుందురు. దేవా!

(అని అందరు నిష్క్రమింతురు)

(రంగము—కృష్ణుండు కీరవాణి.)

(కీరవాణి భయభక్తియుక్తిచే తన్వాయై యొక్క వటంబు వారిముందటన్బెట్టి చేతులుజోడించి)

సీ. జోహారులవెనీకు॰బాహాబలోద్ధూత
ఘనవిక్రమోద్దీప॰కంసభూప
దండంబులవెనీకు॰ధారాధరోపమ
భాసురతరశీల॰భర్మచేల
జోతలివ్వెనీకు॰సుందరావహాసిత
కందర్పశతరూప॰క్రముచాప

మొఱ్కులిడ్వేసిరి • మునిజనసంతాన
సన్నుతగుణజాల • సత్యశీల
గీ. వందనంబులుసద్భావఁవాసుదేవ
శరణులివెహీరకోటీరఁశౌర్యసార
నతులొనర్చెదలకుదుర్మతవిపక్ష
కోటియభివాదనములయ్యఁగొనికాయ. 11

కృ—శీఘ్రమేవ భవదిష్టార్థసిద్ధిరస్తు. (అని తదీయలావణ్యంబున కతి కుతుకాయత్త చిత్తుండై నవ్వుమొగంబుతో)

మ. సకియాయెవ్వరిదానవెందుకొరకైఁచాతుర్యమొప్పారభ
ర్మకలాపద్యుతిఁగోడవచ్చితివిలోకంబైననీరూపుమ
చ్చికచేగాంచినమోహమున్నెనగొనెన్నైల్వొప్పగాచెప్పుత
ప్పకనాతోడభయంబుమానియువతీభాస్వన్మరాళీగతీ. 12
(అనిన శౌరిదయార్ద్రదృష్టికి సంతోషించుచు)
కి—ఆ. పేరుకీరవాణిఁసారసమృదుపాణి
పటములోననున్నఁబడతిమిన్న
సేవసేయఁదానఁజెలగినన్నాచాన
మెచ్చిపంపగానుఁవచ్చినాను. 13
(అనిసమీపించిపటము చేతఁబట్టుకొనిచూపించుచు ప్రకాశముగా)
సీ. ఇదికదాకలలోనఁగదసితేనెలబావి
యనిచప్పరించినయట్టిపెదవి
ఇదికదాయెదయెదఁగడియకౌఁగిలిగొని
సరవితోమెచ్చినఁచన్నుదోయి
ఇదికదాయెడమచేయిడిమేటిముకురంబు
కరణినున్నదటన్నమరునియుక్కు
ఇదికదాతమకంబుఁగదురగామేనిపై
వాలిముదాడుకఁ[illegible]

గీ. ఇదిక దానిపెముడివిచ్చి వదలదీసి
చెలిమితోఁ దూలఁద్రోసినఁ జీలికొంగు
ఇదిక దానిందుజాబిల్లినదరఁగొట్టె
నంచు మెచ్చినయీసుండు రాఁగి మోము. 14

శా. నీమేనత్తకుబుట్టి మోహమొదలో నీమీదటన్బెట్టియు
న్నోమార్గంగజు బారిఁగిట్టి విధిసూనుండింపుఁ జేపట్టియో
భామా నీపతిఁ గట్టియంచుఁ బలుకన్ న్యాభవంబునన్దట్టిమా
రామారత్నము వట్టియున్నదిసుమా ప్రాణంబు సర్వేశ్వరా. 15

(అనిపలుకుపలుకులకు పరమానందంబు జెంది యాపటంబు క
రంబునబట్టుకొని తదీయ్యరూప యావన విలాసంబులకు మెచ్చి
కొనుచు తనలో తాను నవ్వుకొనుచు తలయూచుకొనుచు మీసంబులు
దువ్వుకొనుచు కీరవాణింజూచి)

కృ—ఆ. తల్లిదండ్రు లెవరు తరుణికి పేరెద్ది
యన్నదమ్ము లెందఱతివయుండు
దేశమెచట దాని తేటతెల్లంబుగ
విన్నవింపుమంత వేద్యకాంత. 16

బాలగోపాలా!

కీ—సీ. అధిపనీమేనత్తయైన రాజాదేవి
కూతురై యొప్పెనే కువలయాక్షి
విక్రమశాలులౌ విందానువిందుల
తోబుట్టువయ్యెనే తోయజాస్య
భవదీయమిత్రులై బరగుపాండవులకు
పినతల్లిబిడ్డయే పీతవస్త్ర
వైభవయుగవంతి వరపట్టణంబున
జన్మించెనే మహోజ్జ్వలకలావ

గీ. యదియెరదబృందకాంత్యపహాసితకుంద
సఖిజనానందకచరిత సజలకంద

బుధవిహిత ఛందవరయానవిభూషిత మంద
మేదురార్చితకుందమా మిత్రవింద. 17

(అనుపలుకులు చెవులకు రసాయనంబులై దోప యావటంబు దిక్కు చూచి చూచి) కుంతలాకార మధుకరశ్రేణి! కీరవాణీ!

శ్రు—మ. తరుణీనాక దివావికస్వ గిన దేశ తప్పే మిన్నగొరుట
ల్గర మర్ద్విన్గలలోన దోచినపసుల్గా మింపగా బాడియే
సరవిన్దర్పణ పృష్ఠభాగమున భాస్వ ద్రీతిగవ్వట్టుసుం
దరరత్నంబులమూట సందుకొనకాంతా యొరికిన్నక్యమే. 18

(అని పలుకు కృష్ణుని యభిప్రాయం బెఱింగి)

18 బేహాగ్ రాగం-ఆదితాళం.

కీ—వినుము చెల్వెద దానికులుక్కు పల్కు-పల్కులను-తేనెలొలుక్కు॥
కనులతళుకు-బెళుకు చేపలనుచు జెప్పనొప్పునా। నీ।
గనినమారు డనగ నెంత మనమున నాశ్చర్య మొంద॥ వి॥
ముక్కు సంపెంగపువ్వు నేలు పెద్దయద్దా
ల్చెక్కు లడాలు ముక్కు-టక్కు లాడిపరులుతు మ్మెద
రెక్కలనెకసక్కె ములాడు-నిక్కుచున్న చనులుపిల్ల
జక్కవలకొక్కరించు॥ విను॥
మోముసోముని తోడబోరు-నారుతీరు చీమలబారు
కామినికంధరముదరము-కోమలియానము సమద
సామజముగాను బల-మేమియు లేదు నిజముగ॥ విను॥
పరమదుర్మార్గుల చెండి-చొల్లేరనుపురమున నుండి
ధరణి తా దేవల్లిలక్ష్మీ-నరసింహ రాయాగ్రణికి
సిరులనిచ్చిబ్రోచు సీతా-వరుని బోలినట్టి శౌరి॥ విను॥

సీ. చంద్రచేలంబు భాస్వ ద్రీతి నీకుం బె
చంద్రఫాలంబు మా సతికి లేదె
చక్రంబు నీకర స్థలి ప్రకాశించితే
చక్రంబు మా చెలి స్తనము కాదె

కంజంబునినాభి♦గామోదమొందితే
కంజంబుమాయింతి♦గళముకాదె
రంభనీకడజేరి♦రాగంబుపాడితే
రంభమాసఖమారు♦రతిచెలగదె

గీ. నీకుగలశబ్దవితతిలో♦నిక్కముగను
సగముభాగించుకొనియెసా♦చానమున్నె
రాకనీకేలతప్పుమా♦రామకడకు
బాలగోపాల! రాధికా♦ప్రాణలోల. 19

ఉ. కంటికినిద్రలేదునిను♦గంటినిముందొకతేయిపూటనా
యింటికివచ్చిపుష్పశరు♦డేచఁగనానజనింపజేసిబ
ల్తెంటమెలంగబెట్టితివి♦ధర్మమెరేపటనాస్వయంవరం
బొంటిగనందరిన్గెలచి♦యెప్పగనగ్గొనుమన్నదీశ్వరా. 20

ఉ. అందరికంటెనీకుప్రియ♦మైనచెలిన్గదయెట్లటన్న నే
పొందుగమేనయత్తకును♦పుత్రికనైనకతంబునన్గదా
సుందరరూపయార్గురుని♦చూచిననుందిగనాడపోకటం
బిందునిభాస్యచెప్పవన♦జేక్షణరాగదవయ్యముకుందా. 21

(అని పలుకుపలుకులకు మొలకనవ్వులొలయ నింతలో కం
తుండంత లతాంతకుంతంబులేయ నంతకంతకాకాంతపయి మోహం
బెక్కఁ గోరమీసంబులు దువ్వుచు)

కృ—కుంతలనిందితబంభరజాలా! బాలా!

ఉ. వచ్చెదనేస్వయంవరమ♦వారణజూడగనాడుదానినే
మెచ్చెదరాజలోకమున♦మేయగలిన్నిరసించిదానినే
దెచ్చెదనెవ్వరైనమొన♦జెలియెదిర్చిరయేనిబాణముల్
గ్రుచ్చెదమింటవేలుపులు♦కోయనియార్వమదేభగామినీ. 22

ఉ. వద్దనుమింక నెమ్మదిని♦వారిజనేత్రకు చింతతానునా
పద్దనుకష్టముల్జరిగె♦పాయెనుపాయ మికేలనాకుదా

ముద్దునాకు నీవయినిక మోహముమించెను కూర్మినీపయి
న్నుద్దనుపోయిరమ్మి కనుకకంజదళాభ విశాలలోచనీ. 23

ఈపల్కులు నాపల్కులుగాజెప్పి కర్పూరగంధికి కంతుసంతా
పంబు కొంతయైన శాంతిబఱుపుము. శుభమ్మైన బోయిరమ్మా.

(అనితనపటంబొసంగిన)

(అందరు నిష్క్రమింతురు)

చతుర్థాంకము సంపూర్ణము.



శ్రీచెన్నకేశవసహాయము.

# మిత్రవిందాపరిణయనాటకము.

---

## పంచమాంకము.

(మిత్రవింద, కీరవాణీ, ప్రముఖులు ప్రవేశింతురు)



తల్లీమిత్రవిందా ! నమస్కరించు చున్నదాన.

మి—నీకు శుభంబగునుగాక. (అని సుందరమగుపటంబు ముందరబెట్టిన పటంబు చక్కగా కనుంగొని ముద్దు పెట్టుకొని)

అక్కా! నీయొక్క భక్తిశ్రద్ధాను రాగప్రియంబులకే నెంతని సంతోషింతునే. నావమోధనంబు దొంగిలించిన దొంగను నెత్తెరంగు నపట్టితెచ్చితివే. నీవంటిదాసీలుండ నేలికసానుల కొక్కకొఱంత యైనసుండునా! దీనికి ప్రత్యుపకారంబే నేమియొసంగెద. రమ్ము. ఒక్కబిగి కౌగిలిచ్చెద. చారువేణీ కీరవాణీ! (అని మోహావేశముఖయై పటంబుచూచుచు)

మి—సీ. ఈతడే మరుబారిఁయెరుగనినన్జేరి
మోవిపానకమానుఁముద్దులాడు
ఈతడే బిగికౌగిఁలిమ్మని ననులాగి
చెక్కిలికొరికినఁచెలిమి కాడు
ఈతడే కుచపాళిఁనెలమితోడవిరాళి
జేదోయిముట్టినఁచిన్నవాడు
ఈతడే తొడలంటిఁయింపుతోడననంటి
కంబంబులనివానిఁగన్నవాడు

గీ. ఈతఁడే నన్ను వలపించి♦హితవునించి
మనసుగరగించి మెరసినకీమాయకాఁడు
ఈతఁడేనన్నుగనిచాల♦యిచ్చమెచ్చి
హర్ష మొనరించిపోయిన♦యందకాఁడు. 1

క. ఎప్పుడువచ్చెదననుచును
జెప్పెనునీతోడనాతఁకిజెప్పవుసుమ్మా

కీ—క. ఇప్పుడుశుభమేనమ్మా
తప్పకవచ్చునుగదమ్మ కిథ్యముకొమ్మా. 2

మి—సీ. మెచ్చెనాననుమన♦సిచ్చెనానీతోడ
గలసిమాట్లాడగా♦కంతుమూర్తి
చూచెనావటము చే♦వీచెనానినుకూరు
చుండగాదానవ♦ఖండనుండు
కప్పెనాకూరిమి♦చెప్పెనాముందటి
ముచ్చటలేమైన♦మునినుతుండు
పట్టెనావంకంబు♦కట్టెనాకంకణం
బెలమివచ్చెదనన్చు♦నిందుముఖుడు
గీ. ఒంటరిగనీకుదొరికెనా♦యింటిలోన
చేడెలెవ్వరునినుకాచి♦చూడకుండ
తోచెనానిక్కమందునా♦ధుందువల్కు
పల్కులన్నియువిరిబోణి♦పద్మపాణి. 3

అక్కా! రేపులేదెల్లుండియేకదా స్వయంవరంబు ప్రవర్తిల్లు
ట, యికనమ్మకమ్ముగా నొక్కకూర్కుపోయెద.

(అని అందరు పరిక్రమించిరి.)

రంగము-అవంతీపురము—గొప్పఅద్దాలమేడ.

(కృష్ణసాత్యకి దుర్యోధన ప్రభృతిరాజులు ప్రవేశింతురు.)

(అనర్ఘ్యరత్న వస్త్రభూషణ మాల్యానులేపనసంయుక్తఁజేసి
నవీనమోహినీదేవి లీలప్రకాశించు మిత్రవిందచేలికి నొక్కకాంచనపు

ష్పమాలనిచ్చి మదనమాల కీరవాణులిరువంకలనలంకరించి స్వయంవరంబున కఱుదెంచిన రాజమండలి కనతిదూరంబున నిలిపిన చక్రధరుం డక్కుమారిజూచి పుష్పశరప్రేరితుండై కోరమీసంబులు వడవేయుచు)

కృ-సీ. ఇదిమింటిపైనుండి • యెందుకో తెగిపడ్డ
తొలకరిమెరుపులో • తునకయేమొ
యిదిపూలవిల్తుడిం • పొదవ భార్యకునయి
కఱగిపోసినపైడి • కడ్డియేమొ
యిదినలకూబరుం • డెలమిరంభనుమాని
మరలంగైకొన్న యా • ప్సరసయేమొ
యిదివసంతుండుతన • యేలికకెంపుగా
బంపినచామంతి • బంతియేమొ
గీ. యిదిజయంతుండు ప్రియమెద • బొదలపెంచి
యల్కవొడమవిడిచినరా • చిల్కయేమొ
యిదిఖచరులెల్లముదములు • వొదలిపొదలి
తెరసడల్చినమోహినీ • దేవియేమొ. 4

(ఇవ్విధంబున నవ్వనజలోచనుం డతీత మోహావేశ సంచలిత సర్వశరీరుండై, యాసుందరాంగి నైనాంతికంబుగా కన్నులారఁజూచి)

సీ. వలబడ్డజక్కవ • ల్వలెనున్నవీచాన
పైటలోపలనున్న • పాలయిండ్లు
నిండుచందురులోని • నెరికప్పుచందమీ
యెలనాగమోముపై • వెలయుబొట్టు
పెనుతాచువడగవి • ప్పినరీతిదీసి కీ
లైడమీదఁగన్పడు • బెడగుసొమ్ము
మరుఁడువిండులు రెండు • మఱియెక్కిడినగతి
బొలుచునీలేమ క • న్బొమలవంక

గీ. తమ్మిపై వ్రాలు తుమ్మెద♦దండుపగిది
నింతి మొగమున వ్రేలాడు♦కుంతలములు
రతికరస్థసుహాముకు♦రద్వయంబు
ఖాతి చెలిచెక్కులందుఁ గ♦న్పడు మెఱుగులు. 5

(ఇట్లు తనమనంబున బెనంగొను మోహాతిరేకంబున బొగడుచున్న నింతలో నాసుందరి మందమందయానంబున సుందరీమణుల కై దండలుగొని రాజలోకంబును గ్రేగంటంజూచుచు తదీయ రూప యౌవన విలాసంబులం దృణీకరించుచు కీరవాణి మదనమాలల మొగంబుల్గనుంగొని)

మి—చ. ఎవ రెవరీమహీశ్వరు ల♦హీనపరాక్రమశాలులై మహో
త్సవమున నీసభారుచిర♦సౌధమునిండినవార లిప్పుడో
కువలయనేత్రలార! మద♦కుంజరసద్గతులార! మిమ్ము నే
సవినయవృత్తిఁ గోరితిని♦చక్కఁగఁ దెల్పుఁడి దెల్పనాకొగిన్. 6

(అనిన నాసుందరీమణు లానందంబున)

కీ—సీ. ఈనృపశేఖరుం♦డిభపురీశ్వరుఁడైన
దుర్యోధనుండు ని♦స్తులయశుండు
ఈరాకుమారకుం♦డితనిసోదరుడుదు
శ్శాసనుండూర్జిత♦శాసనుండు
ఈసుకుమారకుం♦డీనృపపుత్రుండు
లక్షణచరితుండు♦లక్షణుండు
ఈయిన తేజుండ♦హీనవిక్రముడైన
కర్ణుండుసద్గుణో♦దీర్ణకుండు.
గీ. ఇతడు మాళవదేశంబు♦నేలువాడు
ఈమహీశుడుకోసల♦భూమివరుడు
ఈధరాపతికాశీశు♦డిభబలుండు
ఇతడుసాల్వరసావరుం♦డిందువదన. 7

కీ—సీ. సద్గుణంబులపేటి ♦ శతకోటిమన్మథ
సుందరుండితడుకృ ♦ ష్ణుండు బాల
హలధరుండీహరి ♦ యన్నమహాబలుం
డీమేటిబలరాము ♦ డిందువదన
యీశూరుఁడారుక్మి ♦ ణీశునితమ్ముండు
సాత్యకియనువాఁడు ♦ సామజగతి
కంసునిమిత్రుఁడు ♦ త్కటవిక్రమాఢ్యుఁడీ
కృతవర్మయనునోపు ♦ కీరవాణి

గీ. వీరుకేకయరాజులు ౹ విబుధహితులు
వీరుసృంజయభూపతుల్ ౹ వీరవరులు
వీరుకర్ణాటకేశులు ౹ విజయయుతులు
వీరుమత్స్యాదసావరు ౹ ల్సారసాక్షి. 8

(అనివేర్వేర జూపించిన కొమ్మనిమ్మళముగాఁజూచి తనకంటికిఁ దంటయైనవాని నొక్కరుసైనన్గానక క్రొత్తచిత్తజునివలెపోచుచున్న వెన్నునిఁజూచుచున్నయెడ కృష్ణుండుపట్టరాని మోహంబున యాదిట్టరిన్గవయఁదలఁచి యాత్మగతంబున)

కృ—ఆహా చక్కెరచవులధిక్కరించగల యీటక్కులాడికమ్మనిమాతెరనొక్కసారియైన జిరుక్కుననొక్కి యందుసందులేక చూరుతేనెలజాలునుగ్రోలి చప్పరించనియుప్పలుగాకి నాలుకనాలుకా! వహవ్వా! మెరుంగుటద్దంబులం దురంగలించు యీకురంగలోచని గండస్థలంబులు కొండొకసేవు నిండువేడుకతో ముద్దుపెట్టని గద్దరీడు పెదవులు పెదవులా! అబ్బురంపు జక్కవగిబ్బలనుబ్బరంబును దెబ్బనబడఁద్రోయునీబిబ్బోకవతి సిబ్బెంపు గబ్బిగుబ్బల దెబ్బలబడి నిబ్బరించనివాని వక్షమ్ము వక్షమ్మా! షహబాస్ తొగలతెగల వగలనగలచేసి జిగి నెగడుచందురుని యందంబు పసందుసేయుని యీమందయాన సుందరాననంబు చెన్నుమీర కన్నులార జూడలేని కోడెకాని లోచనంబులు లోచనంబులా! బళా! రంగారు బంగారుతీగెల సింగార

మెంతని లడాయించ బడాయిగల యీనాతి చేతులు చేతో మోదంబులో చేలితోపట్టుకొని గట్టిగామాటలాడని మేటి కరంబులు కరంబులా! అరే! బెళుకువాలుగల తళుకుల కులుకుగలుగజెలగునీ కోపనచాపలంబులకు చూపులను నోపికతో నిలుపలేనివాని ధైర్యంబు ధైర్యంబా! అబ్బబ్బా! గోచరంబైన మోచాస్తంభంబుల నీచంబులు చేయు నీకర్ణాంతాయత లోచని యూరువులారని మోహంబున తేరి చూచి మచ్చికచే మెచ్చనివాని మానసంబు మానసంబా! నేనె విధంబున నైన నీజవ్వనికొరకై యీవసుధావరులతో తప్పులాడి నైన దక్కించుకొన్ననైతినేని నేనుకృష్ణుండనా! పోషితజిష్ణుండనా! (అమునవసరంబున నమ్మగువ నగుమొగంబుతో రెండుమూడడుగులిడి నచో దుశ్శాసన పుత్రుండగు లక్ష్మణుండు చూచి మదనపేరితుండై యాత్మగతంబున.)

ల—ఉ. ఇచ్చెదనాకటంచుమును • నింపుదలిర్పగవిందరాజువా
కుచ్చెనిదేమిహేతువకొ • కొమ్మకునేడుస్వయంవరమ్ముతా
నిచ్చదలిర్పనేర్పరిచె • నీవిధమెల్లనుచిత్రమయ్యెహా!
యిచ్చపలాక్షినన్నువిడి • యెచ్చటికోజనబూనెచూడగన్. 9

సీ. ఈనారివాతెఱ • పానకంబౌనని
నాల్కగాదదిమోహు • పల్కగాని
యీచానచెక్కులు • యాచించినొక్కని
పండ్లుకావవిరాతి • గుండ్లుగాని
యీచెల్వపయ్యెద • లోచెయ్యిబెట్టని
కరముగాదదిదుఃఖ • కరముగాని
యీసోమముఖిమేని • వాసనల్గాంచని
ముక్కుగాదదికొండ • నక్కగాని

గీ. యెలమితోదీనిసోయగ • మెన్ననట్టి
నోరుగాదదియొకపట్లు • కారుగాని

కోడెతనమునదీనితోఁగూడనట్టి
చెలువుగాదది యొకకొండఁజెలువగాని. 10

(అని తనమనంబున) నేను నూరకచూచుచున్న నీజోటిదాటి సూటిగా యేనీటుగాని చెట్టబట్టునోగాన దీనిపోనీకపట్టెద. (అని కొంతసేపూరకుండి) ఇందరిలో నీసుందరాంగి నన్నట్టిన నేమిపోనిబూనునో! పట్టిననాపట్టులో నీదిట్టరినిలుచునో నిలువదో! నిలవకపెనుగులాడినచో చేడెకుచాలడని కోడెకాండ్రేమైన నవ్వుదురేమో అని యుల్లంబెల్ల తల్లడిల్ల కొంతవడికిధైర్యంబుదెచ్చుకొని కానిమ్ముచూచుకొందమిక్కడ మావాండ్రందరుండ నడ్డగించువారెవ్వరని దిగ్గున లేచి కరవాలంబు ఝళిపించుచు తోవకడ్డంబై.

19 పురాణభూషణం—ఆదితాళం

పోకుపోకిక్కడనిల్వవెబాలా! పాటి!
పోకడనీకెంతోమేలా॥ పో॥
నీకొరకెయూసించివచ్చియుంటి! నీదు!
సోకెల్లకన్నులఁగనుగొంటి! నీకు!
నాకనుదీటుగానున్నదంటి! యింత!
లోకిబాకుబికినన్ను డీకొనెమారుఁడు! దయ!
రాకయున్న-పువ్వుకోలాల!
కాకలపాల్గాకయుందునె॥ పో॥

మి—ముట్టకుముట్టకు దూరముండు! నేను!
గట్టిగనుజూచినను మేనుమండు! నన్ను!
కట్టడిపనులెందుకుదాటిపోర! యింత!
మిట్టిపాటునీకునాయమార, రాచ!
పట్టివైతె యీపనినీకుమేర! యిక!
బెట్టుమట్టుబెట్టుకోక తట్టునతొలగుము! తొలగ!
నట్టయితే నాచిన్నన్న చేబట్టితె నీవెట్టవుదువు॥

ల—సుందరి బెదరించితే భయమాగనా|పనిలే|
కుందునె యూరక వచ్చినాన|జగ|
త్సుందరి యిందుముఖి కౌగిలియ్యకున్న|మోద|
మొందూనె డెందము చెల్వాలమిన్న|నీకు|
వందనము సేతు సేయుమన్న|ఖేద|
మెందుకింత మందయాన సుందరుఁడగాన|కోర్కె|
లెందుకీసవిందనుమాన మెందుకె నాయందు చాన|| పోకు||

ఖి—రాజులునవ్విన సిగ్గులేదా|ఛీఛీ|
నీజన్మము నేలపాలుగాదా యెల్ల|రాజు|
రాజిత తాడేపల్లిక్ష్మా నార|సింహ|
రాయనేలు చొల్లేరుపుర విహార|హరి|
యైజెలగు జానకీశుని గోర|కల్ప|
భూజమగు మనన్ను బ్రోవడె జోకదలిర్ప|శత్రు|
రాజి చూడ నేగోరిన రాజునె నా రాజు జేసి|| ముట్టు||

ఓయి భ్రష్టప్రజ్ఞా! ఈస్వయంవరసభారంగంబున కట్టువదలి నన్ను పట్టవచ్చెద వీరట్టునీకెట్టుపోను. నీవురాచపట్టి వయినట్టు దోచక యున్నయది దూరముండుము. నీమానప్రాణంబులు దక్కించుకొనుము. (అని రాజలోకంబు వీక్షించి ప్రకాశముగా) ధరాధర తల్లజులారా! యీయల్లరి మీయెల్లరి యుల్లంబులకు సమ్మతంబేకదా. (అను నంతలో ననువిందుండు మహారోష భీషణాకారంబుతో వచ్చి వరలోని కరవాలంబు కలుక్కున దూసి చెల్లెలినిఁ బిరిందికిన్ద్రోచుకొని వానినెదిరించి భీకరముగా రౌద్రరసముతో.)

శా. ఎట్రాయిప్పటిపల్కుపల్కు మిదెయాకే హాలికా నైగన్వేతునీ
వట్రామాముకురాస్యబట్టెదువహావ్వాయీమహారాజుల
న్వట్రెన్బట్టపుశీర్షభాగమునకర్వంబెక్కెనా కుట్టనీ
కట్రలాగపుమానసభ్రష్టలమునకన్గాన్పున్న సేపేటికిఁ.

అ. కన్యకస్వేచ్ఛగా నందఱిఁజూచి తనకంటికెవ్వఁడిష్టమైతోచునో వా
నినివరియించుటయె స్వయంవరము. దానియర్థం బొక్కింతయైన
నెఱుంగనినీవొక్క రాజపుత్రుఁడవా! ఛీఛీ! నీమొగంబు చూచుట
పాతకంబునకు హేతువ. ఇట్టినిన్ను గెంటించుటయే మేలు. నీవంటి
తుచ్ఛభూభుజ కుమారులీ సభలోనున్నను బుద్ధిగలిగి వర్తింతురు
గాక. లెమ్ము. (అనెడిమాటలు కర్ణంబుల కశనిఘాతంబులై కోప
దుశ్శాసనుం డాగ్రహాయత్తచిత్తుండై గద్దియపైనుండి దిగ్గునలేచి
కరవాలంబు ఝళిపించుచు)

దు-శా. ఔరాదుర్మతిమత్కుమారకునిసాహంకారతన్దూఱెదా
నీరాజత్వముమాపయిన్నెరపెదే నిర్భాగ్యనీవెంతనీ
బీరంబెంతబలంబదెంతకుమతీ బిట్టల్కుపుట్టించితిం
కేరితిన్బ్రతుకంగజూచెదవునీకీవేళతోమూడెనే. 12

మ. సకలోర్వీతలనాథమస్తకలసజ్జాంబూనదంచత్కిరీ
టకనద్రత్నమణిప్రభాపటలిచేడంబైనపాదంబులి
య్యకలంకాత్మునిపెద్దతండ్రికికదాకయాయోగ్యతల్దూరచే
సికటా! పిల్లనిధిక్కరించెదవెఛీఛీపాపయజ్ఞానసా. 13

ఓరీ! మత్తచిత్త! చతురుదధివలయితభూచక్రస్థిత రాజాధిరా
జమకుటమణి ప్రభావిరాజమాన చరణద్వయుండగు ధుర్యోధన చక్ర
వర్తి సోదరపుత్రుండై వెలంగుచు రంగత్ప్రతాపుండగు నీలక్ష్మణ
కుమారుండీయంబుజాక్షిని నడ్డగించుటయెక్క లెక్కా! యికమాట
ధిక్కరించి మాటాడితివేని నీచెక్కుముక్కు కరుక్కున గోసివేసెద.
హీనశౌర్యా (అని మీదికురుకును, అంతలో కృష్ణప్రేరితుండై కృతవ
ర్మ పుస్తమీసంబులుశిస్తుగా దువ్వుచు పలుకయు వాలుంగొని గద్ది
యపైనుంచి గబక్కునదూకి దుశ్శాసనునదిసి)

కృత-శా. ఓయీ కౌరవరాజ సోదరమదీయోద్యోగ మీక్షించితే
స్సాఫయుతైశ్వర్యముగల్గెనేని యిదెనాకైపైరమ్ము కాసేవుచే

చేయుఁజూచెద నీతనిన్దొడరఁగాంచి తెంపున నీవు త్రుళ్ళకుం
డీయోపామణి బట్టనాయమగునే యీభూమిభృత్సత్సభన్. 14

బాగుబాగు స్వయంవరసమయ సభామధ్యంబున న్యాయ విచక్షణం బిసుమంతయైనలేక హరిమధ్యంబట్టిన నీపట్టికి తండ్రినని చెప్పుకొని యుప్పరంబగల నార్చుచున్న నీగొప్పతనంబునకు నేను సిగ్గుపడుచున్నవాఁడ నిక యూరక కూరుచుండుము. తేదేని నాతో వృథా వాదంబులేక తారసిల్లుము. (అని నెయ్యిపోసిన భగ్గుభగ్గున మండిపడు అగ్గికితగ్గిన కోపంబుచే కరవాలంబు ఝళిపించుచు దుశ్శాసనుండు సమరోన్ముఖుండై మహారౌద్రరసంబు చిందులుగాఁ)

దు—మ. ప్రతివర్షంబున మూఁకకప్పములు శుంభద్భక్తి నర్పించు వీఁ
డతిగర్వంబున మాటలాడవిని యోహోపట్టివాలార్తునే
కుతలంబందొకఁడైననాకు నెదురై కోల్పోక ప్రాణంబులు
ధృతిజీవించెనె రమ్ము రమ్మిక నీదర్పంబొగిం జూచెదన్. 15

ఓరీ! శుంఠప్రతాప! నీకంఠంబు మత్కరవాలధారచే తీరుతీరుగా తరిగి ఘోరంబగు నీకబంధంబటునిటు కావుకావుమని వాపోవు కాకగృధ్రంబు లనేకవిధంబుల గొనియాడ విందుపెట్టెద. ఎట్టకేనికిఁ బోక దిట్టవైరమ్ము. క్రొవ్వియెవ్వరైన పెరుంగక చివ్వకున్నారని త్లైదవ! వీండ్లందరుంజూడ నీకండ్లకావరంబు కొంచెములో దించెద. భోజకులపాంస! (అనునంతకు దుర్దాంత కల్పాంత కాకారుండై మేను పెంచి పండ్లుపటపట కొరుకుచు దుశ్శాసనున్గని యనేకవిధంబులఁ గరవాసివిక్షేపణంబు సేయుచు)

ఉ. మత్కృపాణమొక్క వ్రేలిపినఁ గామానిసినల్పినరీతి నిన్ను నే
నుత్కటరీతిఁబట్టినఁగ వెప్పుగనల్పెద నెవ్వరడ్డమై
మత్కరవాలధారకఁ సమానగతిన్గరమిచ్చువారు ఛీ
సత్కులసూతివై యిటుపొసంగనికూతలుకూయఁ జెల్లునే. 16

రాజరాజసోదరుండవయి రాజలోకంబు ఛీయన చేయరాని పనులు చేయుచు కూయరానికూతలు కూయుచు కులపాంసుండవయి

పుట్టిలి వేదినీ గట్టితనంబు చూపించుము అని మీదికిలంఘించి శిరోజంబులు పట్టబోవు నెడ కర్ణుండడ్డమై కరవాలంబెత్తి సాము సేయుచు)

క—చ. నిలునిలు మోరినిన్ను చన॰నిత్తునె మాయువ రాజు పైకిదో
ర్బలముననన్ను దాకిమద॰పారవిజృంభణశక్తి కోర్చిన
న్గలుగుభవత్ప్రతాపము॰గర్వమునంతటిదాక నిన్ను నే
విలుతునె శూరుడంచునిటు॰బెట్టుమునీముఖమింక దుర్మతీ. 17

(అని గర్వంబులాడుచు దుశ్శాసనలక్ష్మణ సహితుండై కృతవర్మ న్బట్టి కట్టబ్రయత్నించుచు రాధాపుత్రు దుష్ప్రయత్నంబు గనుంగొని సాత్యకి గదాదండంబు కేలన్గొని గద్దియపైనుండి దిగ్గనురికి హేతివాత్రితంబుతో గల వీతిహోత్రునకు సాటియైన కర్ణునకడ్డంబై)

సా—మ. చెడుగానీ మొగమిట్టు ద్రిప్పిగనుదా॰సీపుత్రయో కర్ణ! యి
య్యెడ నేనున్న దెఱుంగ వ్రాకనులక॰య్యెన్నోలు వెన్నొడ్డిబ
ల్వాడిమదాబాహువునందుగ ల్గెడిగద॰స్వీయండవై శౌనిని
ప్పాడొగిన్దాపలచేతబట్టిజనము॰ల్లోపల్లొందగాద్రిప్ప వే. 18

అరే సూతసూతి! దుర్జనవాత్రిత! ఘాతుకుండై జెలంగురంగత్తుంగ పుంగవతురంగునకు సోదరుండనై యప్రకపరాక్రమసంతోషిత శకుతిండై విజయుండనిపేరుజెందిన పాండవమధ్యమునకు ప్రియశిష్యుండనై యున్న నన్ను దాకినీశక్తి ప్రకాశింపజేయుము. నేనుండిభోజవతి న్వారింతునే! రమ్ము. లేనిచో యుద్ధాస్థానంబునందు నిమ్మళమ్ముగా కూర్చుండుము. ఖండితప్రతాప! (అనుమాటలు చెవులకు ములుకులై దోపసాత్యకిముఖుడై)

క—కం. గొల్లడపాలును పెరుగును
చల్లమ్మ్మక బ్రతుకకింత॰సాహసమేలా
బల్లిదులగు రాజన్యుల
నుల్లంబగలించి బ్రతికి॰యుండుదువె చెనటీ. 19

(అనుమాట లశనిఘాతంబులై కర్ణరంధ్రంబులన్బడిన సాత్యకి గదసారించుచు)

(అనిరాజలోకంబు నిరీక్షించి)

ఉ. ఏతపనీయచేలుఁడు మహేశ్వరసన్నుతుఁడేయదూత్తముం
డేతరణిప్రభామకుటుఁడేనవనీరదచారువిగ్రహుం
డేతులసీవిభూషణుఁడయేసుమసాయకకోటిసుందరుం
డాతఁడశేషుఁడుండువరుఁడై తగునీముదరాస్యకిప్పుడున్. 20

కానమీరందఱానందనందనున కీసుందరిసుందరియై పెంపొందుటకు డెందంబుల నానందింపుఁడు ఇదిబృందారక సందోహంబునకును శంకరవాణీవశంకరులకును హితవై యున్న దిందుకెందును సందియంబు లేదు. (అనునెడ మిత్రవింద వధూటికామణి డాసి వ్యాసునకు మ్రొక్కును, ఆసుందరి యందంబుచూచి పారాశరపుత్త్రుండు నవ్వు కొనుచు)

వ్యా-ఉ. జవ్వనినీదుపాయమునకుఁ జక్కఁదనంబునకు నీదురీతికిన్
నవ్వుమొగంబునన్వృషిసనాగరికంబునకు మెచ్చినాఁడనీ
కెవ్వనియందుకోర్కి జనియించెనొ నిర్భయ మొప్ప నేగి నీ
వవ్వరశౌర్యుకంఠమునఁ బాయఁగ నేయుము పుష్పమాలికన్. 21

(అనిన సంతోషిత స్వాంతయై చేతులుజోడించి)

మి-సీ. ఎవ్వాఁడమఱక్రొత్తపువ్విలుకాఁడునా
గొల్లపిల్లలపయిఁబెల్లగొని యె
నెవ్వాఁడువరశౌర్యుఁ డెనయఁగానామేన
మామకుపట్టియై మలయుచుండె
నెవ్వాఁడుసోయగంబింపారఁజనుదెంచి
కలలోననన్మోహకలితఁజేసె
నెవ్వాఁడుబలిమిచే నెల్లదుష్టులఁజంపి
దృఢశక్తితోడ సత్కీర్తిఁగాంచె

గీ. నట్టికౌస్తుభమణిహారు నవసుధీరు
జిష్ణుసన్నుతు సుగుణరోచిష్ణుఁ గృష్ణు

కోరియున్న దినా మది గుణవిధాన
దయఁగనుంగొనుమిక పోయి దండవేతు. 22

(అని నమస్కరించి నిలచియున్న చేడెగ్గాంచి)

వ్యా. శీఘ్రమేవ మనోవాంఛాఫలసిద్ధిరస్తు. సుందరీ! యాలస్యం బెందుకు నీయిష్టమ్ము కానిమ్ము. (అనిన చెలులిరుగడలనడవ మందమందయానంబుల నగ్నికరంబున న్వ్రేలుంగు కాంచనమాలిక హరికంఠంబున వేసి తలవంచుకొని నిలచియుండును.)

(అందరు నిష్క్రమింతురు)

రంగము—వివాహమంటపము.

(గర్గమహాముని విందానవిందులు కృష్ణసాత్యకి బలరామ కృతవర్మలు మిత్రవిందా మదనమాల కీరవాణులు విధ్యుక్తప్రకారంబున కల్యాణంబొనర్చి సోదరీమణియైన మిత్రవిందను కృష్ణునకొసంగి విందానవిందులు చేతులుజోడించి)

విం—సీ. నిరుపమవిస్ఫురత్సరసిజాయతనేత్ర
భైష్మీకళత్రశంభచ్చరిత్ర
పృథుసురభీయుతబృందాటవీలోల
పాలితామరజాలనీలనీల
ఘనరుచిజితసూర్యకౌస్తుభాంచితహార
నవనీతచోరదానవవిదార
సుందరతిలకసంశోభితసులలాట
మానితఖగఘోటమణికిరీట

గీ. రత్నకుండలయుత కర్ణరమ్యపర్ణ
సూరి సందోహమందారతారహార
విజయవందిత గోవిందవిశ్వతుంద
కేశవాచ్యుత సత్కీర్తికృష్ణమూర్తి. 23

చ. పొలుపుగ మీనమామయను పుత్రుడ నేనిటు లుండమానిమీ
చెలియలికి స్వయంవరము సేయుటతప్పని యెంచబోకుడా

ఖలుడు సుయోధనుండు మముఁగారియపెట్టు నటంచుయుక్తిఁ బెం
పలరఁగ జేసినారము సుధాధరమిమ్మె వరించునంచొగిన్. 24

(అని జాంబూనదాంబరాభరణ గజతురగస్యందన భటనటవి
టగాయక పరిహాసకదాస దాసీలనరణంబొసంగి సాగనంపిన అం
దరు నిష్క్రమింతురు)

మంగళహారతి. రాగం. నాదనామక్రియ-ఆదితాళము.

మంగళమిహా శౌరి। లోక। మంగళదాయక మంగళవిగ్రహా॥ మంగ॥
రంగాపతంగతురంగపోషితకు-రంగా సదృశఫాల।
మద। భృంగాచికురజాలా। బుధ। సంగప్రేమచేలా,
రణరంగరిపువిఫాల। యంగజాంగభంగలోల॥ మంగ॥
రామానిర్జితభృగురామా। శ్రీకృష్ణబలరామా రాధికాజార।
పరభీమా కంసవిదారా। రవి। ధామాకౌస్తుభహారా।
గోపి। కాముఖపద్మసూర। కామకామశ్యామాకార॥ మంగ॥
నందగోపాలకనందన సనకాసనందనహృదయతోష।
పరిప్రమండితభక్తదోషజన। వందితచారుభూష।
కవి। మందారనరకశోషా, మందమందసుందరభాషా॥ మంగ॥
నరతాడెపలిలక్ష్మీ నరసింహారాయేడ్య నరసఖమందహాస।
చొల్లేరు। పురభర్మహర్మ్యవాసా। జానకి। వరనిత్యసత్యోల్లాస।
చాంపేయ। వరపుష్పదివ్యనాసా। మురహరశరనిధిత్రాసా॥ మంగ॥

మంగళహారతి. సురటరాగము-ఆదితాళము.

హారతులివ్వగరారెలక్ష్మీ నారాయణహరికి।
సహస్రశయ। వారణరిపుహరికి॥
మహాభయ। కారణభవతరికి।
శిరోరుహా। వారవినీలవిదారితబంభర।
నారులార సుకుమారులార। శుభ॥ హార॥
తొగలమగనిజిగి దెగడెడునగు మొగముగలుగు దొరసుండీ।
తనంతట। నెగడునెపుడుధండి।

శివాదుల। మిగి లెరిపుల చెండి। మహాత్ముఁడు।
ఖగనాయక తురగ-గమనుఁడురుప।
న్నగఫణశయనుం-డగక రిసకబలు॥ హార॥
శరదాంతర్గతచంచలవలెసిరి। యురమునగలవాఁడు।
చెల్వున। మకునిషీకెనాడు। పీతాం। బరము దాల్చినాడు
చూడుడు। తరళేందీవర-దళలోచనముల।
తరుణులారకుం-దరదనలార॥ హార॥
పాలుపుగ చాల్లేడ్చరమున శౌడే। వలిసత్కులమణియై।
మహాబుధ। ఫలదసమగ్రణియై। సదామది।
ఖలనిరసనగుణియై। ముదంబున। జెలగుచుత్కృనరసింహరా-
ట్సదన నిలయుఁడైన హరినీలునకిప్పుడు॥ హార॥

క. సాధారణవత్సరమున
పాదుగనాశ్వయుజశుద్ధశవరవిదియను సం
మోదమున మిత్రవింద సు
ధాధరినాటకము పూర్తి యయ్యె వారిక్రుపన్. 25

ఫలశ్రుతి.

క. ఈనాటక మెవ్వరైనను
మానుగఁజదివినసువిన్న శమతి వ్రాసిన చా
మానితగతి చాల్లేరువు
రీనాథుఁడు బ్రోచుచుంచు శక్రుపరంజిల్లన్. 26

గద్యం.

ఇది శ్రీ మాచెర్ల చెన్నకేశవా క్షీణ కటాక్ష వీక్షణ ప్రవర్ధిత చతుర్విధ కవితావిచిత్ర కాత్యాయనసూత్ర హారితనగోత్ర సూరపరాజగోత్ర రోహిణీశశత్ర సీతారామమంత్రిపుత్ర గురువిమిత వెంకటరమణ కవి శరండపత్ర ప్రణీతంబైన మిత్రవిందాపరిణయనాటకంబు సర్వంబు పంచమాంకంబు సంపూర్ణము.

